# సుగ్రీవపట్టాభిషేకము



౫ అంకముల నాటకము.

గ్రంథకర్త:

సోమరాజు రామానుజరావు గారు.

ప్రకటనకర్త:

కందుల గోవిందం
జనరల్ బుక్కుడిపో,

బెజవాడ.

మొదటి కూర్పు 1000

కాకినాడ స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడియె.

 1926. [వెల 1-0-0.

| —♦ నవలలు ♦— | | —♦ నవలలు ♦— |
| --- | --- | --- |
| ఘోరప్రతిక్రియ | రు. 1-8 | నందచరిత్ర రు |
| కుసుమ | 1-4 | వినోదములు |
| మనోహారిణి | 1-8 | డిటో రెండవభాగము |
| పచ్చపుదొంగ | 1-0 | గణపతి 1 భాగం |
| చంద్రగుప్త | 0-8 | డిటో రెండవభాగము |
| మానసింగు | 1-0 | రఘుకులచరిత్ర |
| కాళిక | 1-0 | సిద్ధార్థచరిత్ర |
| ప్రచండభైరవి | 0-12 | రాజరత్నము |
| వనదుర్గము | 1-0 | అళహాసింగరి |
| కాళిదాసుచరిత్ర | 1-0 | హమీర్ సింగ్ |
| ఆత్మసామ్రాజ్యము | 1-0 | —వైద్యగ్రంథము |
| కలికాలచర్య | 0-6 | యూనానివైద్యం |
| గోకాభిరామాయణం | 0-6 | ధన్వంతరీవిజయం |
| కేసరీవిలాసము | 1-0 | నేత్రదర్పణం |
| చిత్రలేఖ | 0-10 | వ్రణచికిత్స |
| ప్రసన్నముఖ | 1-0 | దంతశోధని |
| ప్రహసనములు | 0-8 | రసయోగరత్నాకరం |
| భారతాభ్యుదయం | 0-12 | సహదేవపశుచికిత్స |
| కర్పూరమంజరి | 1-0 | రసప్రదీపిక |
| సౌందర్యతిలక | 1-0 | అనుపానమంజరి |
| అహల్యాబాయి | 0 12 | సద్వైద్యజీవనం |
| రామచంద్రవిజయం | 0-12 | సుఖరోగచికిత్సారత్నాకరం |
| హేమలత | 0-1[illegible] | శతలోహపాకప్రకాశిక |
| కృష్ణవేణి | 0 6 | పానీయకల్పవల్లి |
| మణిమంజరి | 0-6 | ఆయుర్వేదసారసంగ్రహం |

వలయువారు :—జనరల్ బుక్కుడిపో,
బెజవాడ, కృష్ణజిల్లా.

0-
0- 8
0- 8
0-12
0-12
0-10
0-12
0-12
0- 8
0-12
లు—
0-12
0-10
0 -8
0 -8
0 6
1 -0
0- 6
0-12
0- 8
0-8
0-12
0
0-
0-1

శ్రీ

# సుగ్రీవపట్టాభిషేకము

ఇది

స్వరాజ్యరథాదిబహుగ్రంథకర్తయగు

సోమరాజు రామానుజరావుగారిచే

రచియింపఁబడినది.

ప్రకటనకర్త

కండుల గోవిందము

జనరల్ బుక్కుడిపో, బెజవాడ

మొదటికూర్పు 1000

"స్కేప్ అండ్ కో" ముద్రాక్షరశాలయందు,

కే. సుబ్బారాయుడుబ్రదర్సువారిచే

ముద్రితము.

1926.

రిజిష్టరు ] [వెల 1—0—0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

1. రాముడు—రామాయణకథానాయకుడు.
2. లక్ష్మణుడు—రామానుజుడు
3. రావణుడు—దానవచక్రవర్తి
4. విభీషణుడు—రావణభ్రాత
5. ఇంద్రజిత్తు—రావణాగ్రసుతుడు
6. ప్రహస్తుడు—రావణమంత్రి
7. ద్విజిహ్వుడు—రావణుని ఆస్థానకవి.
8. మారీచుడు—రావణునిమామ.
9. ఖరుడు— } రావణునితమ్ములు
10. దూషణుడు— } రావణునితమ్ములు
11. హనుమంతుడు—సుగ్రీవమంత్రి
12. వాలి—వానరరాజు
13. సుగ్రీవుడు—వాలితమ్ముడు
14. అంగదుడు—వాలికుమారుడు.
15. జాంబవంతుడు—కోతులతాతగారు
16. మాయరావణుడు—రావణుని మాయరూపము
17. జటాయువు—ఒకపక్షిరాజు.
18. శ్రీమహావిష్ణువు—భగవంతుడు

స్త్రీలు

1. సీత—రామునిసతి (కథానాయిక)
2. శూర్పనఖ—రావణసోదరి
3. తార—వాలిభార్య
4. రుమ—సుగ్రీవుని భార్య
5. భూదేవి—పంచభూతములందొకదేవత



శ్రీ

# సుగ్రీవపట్టాభిషేకము.



(నారదుఁడిద్దఱు గంధర్వస్త్రీలతోఁ పాడుచు ప్రవేశించును.)

[అనుబంధము. 1]

నార—ఓహో! కన్నులపండువయ్యె; భూలోకమున సనథ స్వర్గమో—వైకుంఠమో యనఁ దోఁచుచున్నదే?

1. స్త్రీ—నారదా! ఎక్కడియానందము, ఎక్కడికన్నుల పండువ? ఎక్కడిస్వర్గము! ఎక్కడివైకుంఠము.

2. స్త్రీ—చెలీ! అటులంటివేమి?

1. స్త్రీ—మానవజీవితములకు స్వర్గసుఖమెక్కడిది? అన్నదమ్ములదాయభాగములే తెగక కుత్తుకలు తెగుటలేదా?

2. స్త్రీ—సఖీ! అదేమిమాట? అన్నదమ్ములదాయభాగములను న్యాయవిచారణవలను తెచ్చికొని దీర్పు యానందముఁ గూర్పఁగూడదమనా?

1. స్త్రీ—ఆ! చూచెదమింకటలేనా! ఇద్దఱకు కలహమెప్పుడు న్యాయసభయాలోచించుచు తామాక్రమించి పాలించు రాజాధమునకన్నులతోఁ జూచుట లేదా?

2. స్త్రీ—అట్టిపాపాత్ముల పరిపాలనాధికారము క్షణములో ప్రటాశించలగుఁ గాక:

నార—తథాస్తు-తథాస్తు-సుందరులారా! మీపలుకులు నిశ్చయములే కాని యన్నదమ్ముల విరోధములతో న్యాయపరిపాలనము చేసినరాజులునయితము లేకపోలేదు. తొల్లి శ్రీరామచంద్రపరబ్రహ్మమూర్తి యట్లుగావించినాఁడు. ఆదివ్యచరిత్రమును మీకిప్పుడేచూపెదను. రమ్ము. జయ్ శ్రీరామచంద్రపరబ్రహ్మమూర్తికి జయ్.

(అనుబంధము. 2)

(అందఱు ప్రస్థానము.)





## శ్రీ

# సుగ్రీవపట్టాభిషేకము.

### ప్రథమాంకము.

దృశ్యము ౧ — పర్ణశాల.

(సీతారామ లక్ష్మణులు మునివేషములతో ప్రవేశించి.)

రాము — తమ్ముఁడా! లక్ష్మణా! పూజ్యుఁడగు భరతునకు పాదుకలిచ్చి చిత్రకూటపర్వతమును వదలివచ్చి యిప్పటికిదాదాపుగ పదుమూఁడేండ్లయినను, పితృమరణదుఃఖమునకన్న భ్రాతృవియోగదుఃఖము నుల్లమున తల్లడిల్లఁజేయు కన్నీటితో నాపాదములనే పట్టుకొని వదలకుండినభరతుని దివ్యమూర్తి నాకన్నులకిప్పటికినిఁ గట్టినట్లే కనుపడుచుండునుసుమా! అన్నాఁడాతఁడు నాసన్నిధికి రాఁబోవుచుండ, శత్రుండని నీవు చాపమెత్తితివిగాదా?......... ఆహా! భరతుని భ్రాతృభక్తి!

గీ. నేనులేని యయోధ్యను నిష్ఫలముగ
నెంచి నాపాదుకలగ్రహించియుంచి నంది
గ్రామమున వసియించి సౌఖ్యంబువిడచి
భవ్యతారకమంత్రసం భరితుఁడయ్యె.

లక్ష్మ—భరతునియెడల నేనొనరించిన యపజ్ఞత నన్నుగాక మన్నింపవలెను.

రాము—దానినిపోనిమ్ము. తమ్ముఁడా! రాజ్యవియోగము నా దూరను నాడును, దుఃఖరవములతో మాకు మోగిపోయెను. కానన వాసము కష్టభరితమని తలపోసితిమి. కాని, యిప్పటికి పదుమూఁ డేండ్లు వనవాసమున మనమేకష్టముల ననుభవించితిమి! చూడు.

(అనుబంధము. 3)

సీ. దివ్యహర్మ్యంబులఁ ౯ దెగడి యాతాకుల
పరపునఁ జల్లనౌ ౯ పర్ణశాల
సదమలంబై జల ౯ జలఁ బారుచునుఁగడు
ప్రియముఁ గూరు గోదావ ౯ రీహ్రదంబు
దారికిర్వంకలం ౯ దముగ నీడనొసంగి
హాయినొసంగెడు ౯ నంటిచెట్లు
చెంగుచెంగునదాట్లు ౯ చేకనుమూయునం
తనెయదృశ్యములౌ హ ౯ రిణచయంబు
తరులనీడలమొల్లఁగా ౯ బురులువిప్పి
మధురముగఁ బాడియాడునె ౯ మిళ్లగుం పు
సకలహృదయమోదంబు లో ౯ సంగుచుండ
తమ్ముఁడా! రాజ్యమింత మో ౯ దంబునిడునె?

సీత—నాథా! వనవాసము మొదలిప్పటికి మనలనుఁ దల్లిదం డ్రులఁగాఁ జూచుచు,నిద్రాహారములను సయితము పరిత్యజించి మనల నిద్దఱను రెండుకన్నులవలె చూచుకొనుచు, తానేరెప్పలై కాచు సౌమిత్రి దగ్గఱలేనప్పుడుగదా మనసౌఖ్యములు తెలియవచ్చుట.

రాము—జానకీ! సౌమిత్రి మనకొనరించినసేవ నెఱుంగక యి ట్లన్నవాఁడను గాను. అతని ఋణమును మనము తీర్చుకొనలేమని వేరవ

దించనేల? ఇట్టితమ్ముఁడు లేనిచో మనమీవనమున నేమైయుందుమో కదా?

లక్ష్మ—మహాప్రభూ! లేనిచో యని చెప్పనేల? ఈదాసుఁడు మిమ్ములను వదలి యెందుచనువాఁడు?

రాము—తమ్ముఁడా! అదేమిమాట! సదా వక్రస్వభావముగల కాలము మనకు చెప్పి కార్యములొనరించునా!

గీ. నేను నిను వీడవచ్చును నీవు నన్ను
వీడవచ్చు జానకియు నన్వీడవచ్చు,
విపినమున జానకినినీవు వీడ వచ్చు
కరమగు వియోగదుఃఖము నలుగవచ్చు.

(తెరలో) ఆలాగుననే-ఆలాగుననే.

లక్ష్మ—(చెవులుమూసికొని) హరిహరీ! హరిహరి ! రామచంద్రప్రభూ! ఎన్నఁడు లేని యీనోట నీయశ్లీలమేమి? ఈదురుపశ్రుతు లేమి? ఈయశుభముచే నాగుండెలు తల్లడిల్లుచున్నవి

రాము—వెఱ్ఱివాఁడా! ఈయుపశ్రుతికి భయమేల? అటుచూఁడు.........ఎవ్వరోయొక వికృతాంగన "పర్ణశాలయేది?" యని యడుగ ముని బాలుఁడు "ఆలాగుననే-ఆలాగుననే" యని త్రోవచూపుచున్నాఁడు. అంతకన్న భయకారణమేమియును లేదు.

సీత—అమ్మయ్యో! నాథా! ఈవనిత యింతభయంకరముగ నున్న దేమి? (కౌఁగిలించుకొనును.)

లక్ష్మ—అమ్మా ! భీతిల్లకుము. అన్నయ్యా! ఇది రాక్షసాంగన. దీనినివధించెదను. ఇదిగో! ధనుస్సు ఇదిగో! శరము చూఁడుము. (వి[illegible]పెట్టును )

రాము—సోదరా! అది యెవ్వతెయైన మనకేమి? రాక్షసాంగన.

యే గాసిమ్ము; మన కపకారము చేయనివారిని నిష్కారణముగ చం పఁదలఁచుట పాపము గాదా! తండ్రీ! శాంతింపుము.

లక్ష్మ—అన్నయ్యా! మీరు క్షమింపకున్న నివన మిదివఱకే నిష్కంటకమై యుండును.

(శూర్పణఖ ప్రవేశించును.)

(అనుబంధము. 4)

శూర్ప—ఎవరువారు? ఎవరువారు? నన్నుచంపెదనని బెదరించువారెవ్వరు? జగన్మోహనాంగులసి నా కన్నులఁబట్టిలాగికొని వచ్చుట చేత నొక్క కౌఁగిలి కాశించివచ్చితినిగాని కరవాలమున కాశించి రాలేదే? ఎవరువారు? నన్నుచంపఁదలచినవారెవ్వరు? సౌందర్యవతినగు నన్ను శ్మశానమున కంపనె దినకఠినహృదయు లెవ్వరు?

లక్ష్మ—అన్నయ్యా! ఆదానవి యట్టహాసము చేయుచు నీవంకకే వచ్చుచున్నది. ఒకవేళ నది వదినగారి కేదేని యపకారము చేయునేమో శరచాపములు బూని, సిద్ధముగ నుండనా?

రాము—తమ్ముఁడా! తొందరపడకు, శృంగారమును వర్షింపఁ దలఁచిన సుదతియెదుట చురియలాగి ఝళిపించుట భావ్యము కాదు.

సీత—(నవ్వి) నాథా! ఏమిది? ఇన్నినాళ్లకు పరస్త్రీశృంగార చర్యలపై భ్రాంతిమరలినది?

రాము—ప్రేయసీ! ఈవనితచర్యలు విపరీతములుగానున్న వి. పాపము. మనోజనితమగు మానసవికారమే కాని, కపటముంతెనలేక ప్రకాశించుచున్నది. ఈమెతోఁ గొంతతడవు వినోదింతుముగాక!

సీత—నాథా! దుష్టులతోడి వినోదమును దుష్ఫలితమునే యొసంగుట గలదు.

రాము—జానకీ! ఇంతలో నేమి మునుగును?

శూర్ప—నన్ను చంపువారెవ్వరు? చెప్ప రేమి? చెప్పరేమి?

(దగ్గఱకు వచ్చును.)

లక్ష్మ—ఓదుష్టదానవీ! పూజ్యులగువారి సమీపమునకు వచ్చెదవేమి? దూరముగ నుండుము.

శూర్ప—నీవెవ్వఁడవు? నన్నుఁ జూచిన నాకోడలు మంచుకొని పోవుచున్నది. తరుణవయస్కనగు నాపై ధనుర్బాణముల నెత్తెదవేమి? మిసమిసలాడు సొగసుఁగల నాపై రోసరోస లాడెదవేమి? ఇంతకును యీతఁడెవఁడు? నీవెవఁడవు? అందము నాకారము లేక నాసౌందర్యమూర్తి నతుకుకొని కూర్చుండిన యీనిర్భాగ్యురాలెవ్వతె?

లక్ష్మ—పాపాత్మురాలా! పూజ్యులనిట్లు దూషించిన నీనాలుక కోయవలసినదే?

(అనుబంధము. 5)

శూర్ప—నాలుక కోసెదవా! అయ్యయ్యో! ముక్కుచెవులను ముద్దుపెట్టుకొనఁదగిన సరసుఁడవు. నాలుక కోయుదునని బయలుదేరుటేమి బాగున్నది?

లక్ష్మ—అట్లయిన ముక్కుచెవులఁగూడ నాకత్తిచే సరసమాడించెదనులే.

శూర్ప—సరసమాడువఱకు వచ్చినదిగదా గ్రంథము? ఇఁక నేమి? మనోహరా! మీరెవ్వరో చెప్పరా!

లక్ష్మ—ఛీ! ఛీ! నీకు మనోహరుఁడెవ్వఁడు? ఇచ్చటనుండి, కదలెదవా లేదా?

రామ—తమ్ముఁడా! కదలకున్ననేమి? చార్వాకముఖము నుండి బ్రహ్మోపదేశమువలె, కుక్కనుండి విశ్వాసగుణమువలె నీదానవినోటినుండి నిష్కపటవాక్యములు వెలువడుచుండఁగా విని, యానందింపఁజాలక, నాగ్రహించెదవేమి? మనచరిత్రము దీనికి వచింపుము, తప్పులేదు.

లక్ష్మ — మహాప్రభూ! వనవాస మొనరించుచు, ప్రచ్ఛన్న జీవనము నం గున్న మా వృత్తాంత మీయువకులకు దాని నోటవేయు టేల ?

రాము — నాయనా! ప్రచ్ఛన్న మేమి? బహిరంగ మేమి ? మానవు డెవ్వరియెడఁ గూట తన జీవచరిత్రమును దాచుకొనఁగల డు? పృథ్వియు, నాకాశమును, సూర్యచంద్రులును, రాత్రింబవళ్ళును, పంచభూతములును, వేనోళ్ల — నివిచిత్రప్రపంచ చరిత్రమును ఘోషించుచుండ, నొకరియెడ ప్రచ్ఛన్న మేమి? వేరొకరియెడ బహిరంగ మేమి? అదిగాక, తమ్ముఁడా!

ఉ. ఎందఱు రాజులీధరణి నేలఁగ లేరు. గతాసులౌచు తా
మెంద ఱుమ్రింద లేరు; భువి నేలఁగ దగ్గ ముహూర్త మందె గా
నందముతోడ ఘోరవిపినావళిఁ జేరినవారి, సత్కథా
బృందము లందపూర్వ శ్రవణేచ్ఛ నొసంగవె? జీవకోటికిన్

అదిగాక, తమ్ముఁడా! సత్కవీశ్వరులు రచించు గ్రంథరాజములయందు నయితము కష్టము లనుభవించినవారి యితివృత్తములు గాదే వర్ణింపఁబడినవి. కష్టాంతమున, సుఖాంతమగు, గ్రంథపరిసమాప్తియే కదా పఠకున కానందజనకము'

లక్ష్మ — అన్నగారియాజ్ఞ ననుసరింతును. — ఓ దానవి!

సీ. బహుసహస్రాసుర । భంజనుండౌ పఙ్క్తి
రథభూమిపాలుని । ప్రథమసుతుఁడు
మునియజ్ఞహరణ న । మ్మోదిసుబాహు తాట
కిని గూల్చినట్టి న । త్కీర్తియుతుఁడు
పవనవేగముతోడ । బాణవేగముఁ జేర్చి,
మారీచు నెగచిన । మహితబలుఁడు,
శాపంబు చాపంబు । సమముగా నెత్తి
భార్గవు నణచిన । దుర్గముండు

తండ్రిమాటను, తాపసో త్తములకిడిన
యభయదానంబుఁ బాలింప నడవి జేరి
నట్టి సద్ధర్మశూరము న్భుజుండు
సబలసాంద్రుండు; శ్రీరామ చంద్రుఁడితఁడు.

శూర్ప— మాచక్కనికైన మమతగలిగించుమనోహరమూర్తిని, భయంకరముగవర్ణించిన నీతెలివి తెల్లవాటివల్లెయున్నది. సరి! ఈతఁడు రామచంద్రుఁడని తెలిసినది. సంతోషమైనది. కాని, యీపు డమువలె మొగము, కోతిపిట్టమామిడిపండ్లవలె బుగ్గలు, చేగోడీల వలె చెవులుఁ గలిగి ప్రత్తిగింజలవలె గుర్తుతెలియుచూచు నీకాంత యెవ్వతె? దీనిని దగ్గఱఁ జేర్చుకొని కూర్చుండుటచేతనే యీయనరసికత వెల్లడియైనది. ఔనౌను—అందుచేతనే, నీవీనిర్భాగ్యుని రసికత వర్ణింపక, రౌద్రరసముతో సరిపెట్టితివి.

లక్ష్మ—ఓపాపీ! నీయందిప్పుడు ప్రయోగింపఁదగినది, శృంగారరసముగాక రౌద్రరసము. కావున నట్లు చెప్పితిని. అందుసైతము నీవేడ్చిపోవుదువనియే "రామచంద్రు"ఁడని రవంతశృంగారము మేళవించితిని.

శూర్ప—ఆమాటనుఁ బట్టుకొనియే యింతగాఁ బ్రాకులాడుచున్నాను. కాని, నీవెవ్వఁడవు చెప్పుము. వీనికిని నెట్టిసంబంధము? వరుసయైనచో, గాఁతఁడిష్టపడకున్న నీవైన ననుకూలింతువేమోయని యాశపడుచున్నాను.

లక్ష్మ—(తనలో)అకాలపుపైత్యపుముండ; ఇఁక నాపైఁబడునేమో,

రాము—ఓదాసీ!

7. ఇతఁడు కనురెప్పవోలె, నా న్నింతకాల
మడవిలోఁ బరిరక్షించి నట్టివాఁడు

ముద్దుతమ్ముఁడు; నాకుడి కే భుజము; పేరు
లక్ష్మణుఁడు శూరలక్షణ కే లక్షితుండు.

ఈ సతీమణి సీతయనునామధేయము గలది. మిథిలాపురాధినాథుఁడగు జనకునికుమార్తె; భూపుత్రిక.

శూర్ప—బలగముగలవారు కనుక, బహుచమత్కారముగ నెవరిపేరువారినోటగాకుండ క్రియ్యకొనిరి. ఇఁక నాపేరును నాయవయవములే చెప్పును. మీ తెలివితేటలు చూతము; నాగోళ్లను నాపేరడుగుఁడు;

లక్ష్మ—ఓహో శూర్పణఖా?

శూర్ప—నాకు "చుప్పనాతి" యని. నామగఁడు పెట్టిన ముద్దుపేరొకటియున్నది. కాని, రామచంద్రా! కోయకొండవాండ్రు వెంకి ఎల్లి-పుల్లి-నుల్లి యను ప్రేర్లవలె సీత-పీత-యని పేరుపెట్టుకొని, నామోచేతితో నొకకొలతకైనరాని యీమానవి, నీశృంగారచేష్టల కేమి తగినది? అసుదియన్న దిట్టుండవలసినదా? నావంటిసుందరి నీకు భార్యగా నిదివఱకు లభింపలేదుగాని, యిప్పుడు లభించినప్పుడైన, ననుభవింపలేవా మనోహరా!

సీత—(తనలో) ఆహా! ఏకపత్నీవ్రతస్థుఁడగు ప్రాణేశ్వరునకు ద్వితీయకళత్రదర్శనమును నాకు సపత్నీదర్శనమును, నెన్నినాళ్లకైనది

రాము—శూర్పణఖా!

గీ. అగ్నిసాక్షిగఁబరిణయ మే మాడినట్టి
కాంత సుగుణమే కాని, యూ కే కారచింత
తోడఁ; బనియేమి నాకు? నీ కే ల యబ్జాక్షి
యెట్టిదైనను, నాజీవ మే యీ నెలఁతయే.

సీత—(తనలో) సదా హృదయేశ్వరుని దయకు పాత్రురాలను.

శూర్ప—దేవా! ఏమిరసికుఁడవోయి రామచంద్రా! మొక్కజొన్నపీచువలె బలిసినగొఱ్ఱెబొచ్చువలె నుండవలసిన వెండ్రుకల యంద మీవిధముగ, కోడియీకలవలె మెత్తగాబొగ్గులయినను, సౌందర్యమని భ్రమయేనా? పర్వతగుహలవలె బుస్సున గాలి పీల్చుకొనఁదగిన ముక్కురంధ్రములు మూసికొనిపోయికనుపడకుండ, గాడిదగత్తెరయయినను, మనోహరము లనుమాటయేనా? అడ్డముగా పొట్టిగా లావుగా నేపుగాయూరిన పెండలపుదుంపవలె నుండవలసిన ముక్కు సన్నగా, పొడుగుగా నుండు టందమనియే మెచ్చుకొనుచున్నావా? ఒక్కటేలావుగ, పట్టెడుపట్టెడుండవలసిన పెదవుల యందమంతయు పాడై మధ్యనురెండుపంకలుగచీలి యటుకొంత యిటు కొంతయై సన్నఁగా నెఱ్ఱఁగా నుండవికారముగనున్నను, ఆపెదవులను జూచియే కొరికి చూచుటకుదుమంటివా ? అట్టె మోహమున మగవాఁడొడలెఱుంగకుండ పట్టి కౌఁగిలింపఁగా చేతులుముట్టిరాగా పైన బారెడుమిగులవలసిన మాంసమున్నదో లేదో యను సందేహము గలిగినప్పుడింక నందమేమి? అధ్వానము. ఇఁక శరీరపురంగా? చక్కఁగా నూనెవలె, నిగనిగలాడుచు, కాటుకవలెనుండవలసినశరీరము పసుపెక్కువైన పారాణివలెనుండఁగా మురిసిముక్కలగుచుంటివా?

లక్ష్మ—అట్టివాగకు మూతిపగలఁగొట్టెదను.

శూర్ప—మూతిపగలఁగొట్టుట సరసమునకు లక్షణమే కాని, 'వాగవల" దనుటయే, నాకష్టముగానిమాట. ఔను. కురూపియో సురూపియో యొక భార్యయున్ననానితోఁ నాకేమిమాటలు? నీతోడనే మాటాడుదును.

లక్ష్మ—(అప) అన్నయ్యా! ఎంతసేపీదాని విట్లు ప్రేలుట!

రాము—(అప) నాయనా! ఇందు ప్రేలాపనమేమున్నది? రాక్షసమతముగదా!

శూర్ప—అదిగో! లక్ష్మణుఁడేదియో రాముని చెవి కొఱుకుచున్నాఁడు. లక్ష్మణా! ఆ సరసము నాతో నేడువరాదా! నాచెవియే కొఱుకరాదా!

లక్ష్మ—చెవికర్ణమేమి? రెండు చెవులు, నొకముక్కు కొఱుక వలయునని తలఁచుచున్నాను

శూర్ప—ఆహాహా! కమ్మగా సరసముగా నట్లుకొఱికిన నీమన్మథుని కఱకుఁవేటుల బాధ కొంచె ముపశమిల్లునుగదా! లక్ష్మణా! నీవిష్టపడుచు చేయుచున్నావుగాని, నీయందమేమియు నామనస్సున కెక్క లేదు. రామచంద్రా! అల్ల నీరేడుపండువంటి నీరూపము కొంతవఱకు నాకు నచ్చినది. నీవుపూర్తిగా నిరాశఁ జూపించుచున్నావుగదా, యెట్లుగ నున్న యీవికారాకారునిఁ గట్టుకొనవలయు. ఏదోయొకటి శీఘ్రముగఁ దెగవేయవేమి?

లక్ష్మ—చెప్పలేదా? ఒకటిగాదు మూఁడు. రెండు చెవులు, ఒకముక్కు.

రామ—శూర్పనఖా!

(అనుబంధము 6)

గీ. వసుధలో మానవులకు వివాహసరణి
కొలఁదియెఱుఁగని కామేచ్ఛకొఱకుఁగాదు;
జనుని బ్రతుకున కిహపరసాధనమయి
తనరు సంతానఫలలాభమునకుఁగాని.

అట్టిఫలిత మీపవిత్రజన్మయగు జానకివలన నాకు చేకూరునపుడు నిన్నుఁ గట్టుకొనుట పాపముగాదా! అదిగాక నాకేకపత్నీవ్రతము.

శూర్ప—ఛీ! ఛీ!! ఛీ!!! ఆడుదానివలె—అప్రయోజకునివలె. నపుంసకునివలె మాటలాడితివి. ఈ తలతిక్క వేదాంత మూడుదాని

నేలుకొనలేని నిర్భాగ్యులనుగుట నా బ్రహ్మ వ్రాసినాఁడు. మగతన మగలవానికి మానినీమాన భగలవానికి దేహమున జవసత్వములుడు గనివానికి నూగుమీసములైన సరిగ నల్లఁబడనివానికి నీయట్టివానికి యేకపత్నీవ్రతమేమి? మాయన్నయగు రావణునివలె బహుపత్నీవ్రత మేల నవలంబింపఁగూడదు; ఇదివఱకు లేకున్న నిప్పుడేల మొదలు పెట్టఁగూడదు? మాయన్న చూఁడు ముచ్చటగా నెందఱు పర కాంతల నెత్తుకొనివచ్చినాఁడో? ఇంకెందఱిని తేదలంచినాఁడో —

సీత — (తన) ఇది చార్వాకునకు సతిగానుండఁదగిననీతి వేత్త;

రాము — రాక్షస కాంతవగు నీకట్టినీతి సహజమైనను శూర్పనఖా! ఏక కాలమున బహుజనులతోఁ గలియుశక్తిని పరమేశ్వరుఁడు మనకు ప్రసాదింపకుండుటచేతనే యది ప్రకృతివిరుద్ధమునియు బలవదంగీకృత కార్యమనియుఁ దెలియుటలేదా? అట్టి కార్యము పాపముగాదా?

శూర్ప — ఔనయ్యా! నీవు భవనమువిడిచి వనముఁ బ్రవేశించినపుడే సంసారమువిడిచి సన్యాసముఁ దాల్చితివి? నీతో నాకు ప్రసంగము. లక్ష్మణా! ఇక్కడికి రామునిపై నాశ తీరిపోయినది. నీవు సరసుఁడవు. ఎఱ్ఱగా నందముతక్కువగానున్నను, ఏపుగా బొద్దుగాఁ బెఱిగి, పెండ్లములేక పెటపెటలాడుచున్న వాఁడవు. నీకును నాకును సరిపోయినట్టి. మనకిది యుభయతారకముగ నుండును. రా! రా! నీకు కాంత లేదు. నాకు కాంతుఁడు లేఁడు. ఆపాడుధనుస్సు, బాణములు వదలి, నా కౌఁగిలింతలకు గిలిగింతలిమ్ము. (మీఁదఁబడఁబోవును.)

లక్ష్మ — ఛీ! ఛీ! — పాపీసీ! దూరముగనుండు, ముట్టఁబోకు; మదపుకంపుగొట్టునీయొడలిని, నాయొడలికిఁదగిలింపఁబోకు.

శూర్ప — నీయన్నవద్ద నొక కాంతయున్నదని దగ్గఱకుఁ బోలేదు. నీకట్టి ప్రతిబంధకము లేనప్పుడుగూడ తాళుదువా? రా — రా — (చేయిపట్టిలాగును)

లక్ష్మ—ఓసీ చండాలురాలా ! నీకు రాగతము మితిమీరు చున్నదేమి. వదలు; చేయివదలు.

[అనుబంధము 7]

(చేయిపట్టి లాగును)

శూర్ప—అబ్బబ్బ! ఎంతచక్కగనున్నది. ఎంతతీయఁగనున్నది! ధనుస్సు విఱుగలేదుగద ! చూచుకో ! దురదపై గోకినట్లున్నది ! నేనిట్టి సరసముకొఱకే యేడ్చునది!—ఆమాత్రపుకోపము జూపనిమగడు మగఁడా?—లంకలో నాకొకయిల్లున్నది. రా! అచ్చటికిపోదము. నిన్ను స్వేచ్ఛగా వీపుపై నెక్కించుకొని మునిముండకొడుకుల పర్ణశాలలకుఁ దీసికొనిపోయి మొక్కజొన్నపొత్తులవలె చిలగడదుంపలవలె విఱిచి నీనోటికందిచ్చెదను. వారి పచ్చినెత్తురిద్దఱమును కడుపారఁ ద్రావి, తాండవము లాడవచ్చును. నీదెబ్బతో మన్మథుఁడు ముండకొడుకు పూవుదెబ్బలబాధ సగముతీరినది. కాని నీ కౌఁగిలింతచేతగాని మిగిలినది తీరదు. ఈపాడువేషము దీసివేయించి, నిన్ను భాగ్యవంతునిఁ జేయింతును. నిన్ను మాయన్నయగు రావణుని పాదములపైఁ బడవేసి, గొప్పయుద్యోగమిప్పించెదను. ముందు కౌఁగిలించుకో ! నామాట విను— చెడిపోకు — నాశరీరము కామవికారమున జలదరించుచున్నది. [లాగును]

లక్ష్మ—భ్రష్టురాలా ! చెప్పుదెబ్బలతోఁ గాని, నీకీచిరచిర యణఁగదు. ఈదెబ్బ కాచుకో ! మన్మథుఁడు కాలికిబుద్ధి చెప్పును.

[చెంపపైకొట్టును]

శూర్ప—అబ్బ ! అబ్బ ! చీమమిరపకాయవలె నెంతఘాటుగానున్నదిరా నీదెబ్బ! మనుష్యునికింతటిజవసత్వములు గలవని నేనెఱుఁగను. నీ చేతులుపడిపోను — నీబలము పాడుగాను—నీసరసము

చట్టుబండలు గాను—రక్తము చిందు చున్నది; తల తిరుగు చున్నది; రామా ! రామా!!—సీతమ్మఁడను రాగ మెఱుఁగుననుకొంటిని; గాని మగతనము లేనినీవే నయము. లక్ష్మణుఁడు మొండి బండ. చేతికన్న చావమే సరస మనిపించినాఁడు. నీవే సరి;రా! మాతిపైఁ గొట్టినసీ తమ్మునిఁక ముద్దుఁబెట్టుకొందునా? ఛీ ! ఛీ!! వట్టియప్రయోజకపు పెద్దమ్మ—కోపదారిపిండము—వలఁచి మీఁదఁబడినసుందరాంగిని వాయఁగొట్టినాఁడు. ఈకాంత యొక్క తెనీకు ప్రతిబంధకముగనున్న చో—వేఁపిన కందినడియనును వలె, దీనిని కరకర నమలి తిందును. ఆనెత్తుటిమాతితో నీకు రెమతీయనిముద్దు లిచ్చెదను.

[దగ్గఱకువచ్చును]

సీత—(భయముతో) నాథా! నాథా ! రక్షింపుఁడు.

రామ—ప్రాణేశ్వరీ ! భయము లేదు. (దగ్గఱకుఁ దీసికొనును)

లక్ష్మ—ఛీ ! పాంసులా! ఛీ ! కులటా ! నీకు మరణము సమీపించినది (జుట్టుపట్టుకొని)

గీ, ఖరవాసురఘోరరూ పంబుఁ దాల్చి
జానకీదేవి సాధ్విని జంపఁదలఁచి,
నిన్ను గవయఁదలంచిన నింద్యచరిత
రయముఁ వధింతు సెలవిమ్ము; రామచంద్ర!

రాము—లక్ష్మణా ! దీనిని ప్రాణములతో మాత్రము వదలుము. దుష్టురాలైనను, మమతపడి వచ్చినదిగాని, కపటమెఱింగినది గాదు.

సీత—నాయభిప్రాయ మదియే—అదిగాక, రాక్షసియైనను నీమె వనితగదా!

లక్ష్మ—ఓ శూర్పనఖా! శ్రీసీతారామచంద్రుల యనుగ్రహమున ప్రాణభయముం బాసి బ్రతికితివి! నీముక్కును, జెవులను గోయవలయునని నాకు మొదటినుండియు నభిలాషగలదు. ఆకోర్కెం దీర్చుకొందును (కోసి) పో! నీయన్నతో చెప్పుకో—పో.

శూర్ప—హాహాహాహాహా!! ఓరిదురాత్ముఁడా! చండాలుఁడా! పాపాత్ముఁడా! ఎంతపరాభవమొనరించితివి! నాయన్న రావణునితోఁ జెప్పి, ఈదుష్టురాలి నవమానముఁ జేయించి, మీయిద్దఱిని జంపింపకున్న నాపేరు శూర్పనఖ కాదు; చూడుఁడు! హా! అన్నా! రావణా. రక్షింపుము రక్షింపుము!!

(ప్రస్థానము)

లక్ష్మ—నీవిక్కడినుండవగుట వలన, నీమాటలు నీయన్నకు సరిగ దెలియవేమో! వాని నిక్కడికిఁ దీసికొని రా. నేను విపులముగఁ జెప్పెదను.

సీత—నాథా! దీనియార్భాటముచే నీవనమంతయుఁ బ్రతిధ్వను లిచ్చుచున్నది.

లక్ష్మ—అబ్బబ్బ! రెండు గంటలనుండియు నొక్కటేకోలాహలముచేసి యీదానవివిడిచిన శనివదలినట్లున్నది

సీత—సౌమిత్రీ! శనివిడచినట్లుగాక యీశూర్పనఖాభంగముతోడ నేదో యొకమహాకష్టసంబంధము గలిగినట్లు నామది భీతి వొడముచున్నది!—

రామ—జానకీ! కానిమ్ము విధివశంబునవచ్చు సుఖంబులకు మాత్రమే మానవుఁ డనుభవార్హుఁడు గాఁడు; కష్టములును సమానములే! చూడుఁడు.

సీ. పదునాల్గువర్షముల్ ◦ వనవాసదీక్షను
గావించితిమి; యవి ◦ గడచె నెటులొ
దినచర్య యొక్కటే ◦ తీరునై; మనకష్ట
సుఖసంతతుల కెందు ◦ చోటు లేదు
శ్రీరామవనవాస ◦ చిత్రనాటకమునఁ
బ్రథమాంకమైనుండి ◦ బహుళకష్ట
సంతాపములు రాఁగ ◦ సకలదిఙ్మండలం
బులలోన మనకీర్తి ◦ మలసియాడు

గీ. ఖరవినాశకర్ణ ◦ నాశికాచ్ఛేదన
కథ మొదలగునాట ◦ కమున మూల
వృత్తమగును; గాన ◦ విమలమై యాచంద్ర
తారమగును మనదు ◦ ధవళకీర్తి॥

మిత్రుఁడా! కాలకృత్యములకు వేళయైనది గాదా!

లక్ష్మ—చిత్తము. మనము పర్ణశాలకరుగుదము.

(అందఱు ప్రస్థానము)

ప్రథమాంకము.





శ్రీ

# సుగ్రీవ పట్టాభిషేకము.

## ద్వితీయాంకము

ప్రథమదృశ్యము-రావణుని సభామందిరము.

(ద్విజిహ్వుఁడు ప్రవేశించును.)

ద్వి—ఆహా! ఏమి? నిండుకొన్న యాత్మీయ పాత్రలవలె నీయాసనములు, అయ్యవార్ల గారి కట్టెంటివలె నిర్మానుష్యమైన యీ రావణ సభాభవనంపు సొంపు. నేనే మొదటివాఁడనా నేటికి? శ్రీ నాదేయైనదే'

(తెరలో)

ద్విజిహ్వ! ద్విజిహ్వ!

ద్వి—ఆ! ఎవరువారు? ప్రహస్తుఁడా?

(తెరలో

ఏమనుచున్నావు? శ్రీనీదే యనియా?

ద్వి—ఔను గాదా మరి? శ్రీ నాది; చుక్క నీది; దెబ్బలుతరువాత వారివి.

(తెరలో)

హేహే హే! నీకింక శ్రీ కూడనా? కల్యము వదలి సత్యమునఁ బడితివిగాదా?

ద్వి—ఔను. అయిన?

(తెరలో)

కవికిని, శ్రీకిని, చుక్కెదురుగాదా?

ద్వి—అప్రారబ్ధము స్వకపోలకవులకు లే.

(తెరలో)

స్వకపోల కవులని, పరకపోలకవులని, రెండుజాతులుకూడనా? కర్మము!

ద్వి—కాదా? మాతాతగారి ప్రాతతాటియాకు పుస్తకములపై పేర్లుమార్చి నేను కవినగుచుంటిని. ఇట్టినాకు ధనముండదను శాపము లేదు లే?

(తెరలో)

ఏకవి కైన దరిద్రమే లే! నీకపకీర్తి యొకటధికము. హే-హే-హే-

ద్వి—"హే-హే-హే-" యని చాటునసాగెద వేమి? రా—సభకు రా.

(తెరలో)

వచ్చుచున్నాను.

ద్వి—అహా! గున్న యేనుగంత తేలికముండకొడుకు; రోకటి బండవలె నడచునప్పటికే సూర్యాస్తమయమగును.

సీ. కడుభారమాట పెకే న్నకువ్రాలు తలవాఁడు
నూతిఁబోలుపెకె న్నూతివాఁడు
కత్తికిలొంగని కే గుత్తంపుతలవాఁడు
జానెడుగుబురుమీఁ కే సాలవాఁడు
పెనుబానమీఁరిన కే పెద్దకడుపువాఁడు
కంతానగలలింగ కే కాయవాఁడు
చింతనిప్పులుగ్రక్కు కే చిన్నకన్నులవాఁడు
వేలరుద్రాక్షల కే మాలవాఁడు

బొల్లిబొల్లియేన్పు కల్లనవ్వులవాఁడు
కడిమివయసువాఁడు నడుమునడుము
చిట్టిబుస్సగానుఁడు జీకాకుపడువాడు
దొరరంగువాఁడు దొంగవాఁడు.

(ప్రహస్తుఁడు ప్రవేశించును)

ప్రహ—ఆచార్యోత్తమ! నమస్కారము.

ద్వి—ఓహో! నేనెఱుఁగుదునండి నేనెఱుఁగుదునండి. మీరూరక వంకదండములు పెట్టుటయేగాని అంతకంటెను మరేమియును లేదండి. మహారాజబాంధవులు, మంత్రులు, మీరు సూమొగము చూపెదరండి.

ప్రహ—నేను బాంధవుఁడనే కాని, మీరుమిత్రులు, పాత్రులు, అపాత్రులు, సత్క్షేత్రులు, అర్థరాత్రులు, అక్షయపాత్రులు, అంధనేత్రులు, అపకృతిగాత్రులు, మంగళసూత్రులు, లంకాపూత్రులు, విరేచనమాత్రులు.

ద్వి—ఆ! ఆ చాలుచాలు. అట్లుచదవకు; అట్లుచదవకు నాకు పైపోటీ కవిత్వము చదువకు.

ప్ర—సరిగాని, కవిగారూ! మీరు కలరాగంగ వెఱ్ఱులనువదలి వేసి, గణయతిప్రాసలలోఁ బడితిరేమి?

ద్వి—ఇదిగో! ప్రహస్తా! నీకొక్క పరమరహస్యము చెప్పుచున్నాను విను. కవిత్వమంతసులభజీవనోపాయవిద్య నాకింకొకటి కనఁబడలేదు, దానికి కావలసినవెల్ల పదిపుస్తకములు. గణముక్కఱలేదు. నీశ్రమక్కఱలేదు.

ప్ర—పదిపుస్తకము లెందులకు?

ద్వి—ఎత్తివ్రాయుటకు మరొకగ్రంథము వ్రాసితినని చెప్పుకొనుటకు.

## ద్వితీయాంకము.

ప్రతి—మీకవిత్వమిట్లే యేడ్చుచున్నట్లా?

ద్వి—ఆహా! అవ్యాహతముగ తానేడ్చుటయే కాదు, పదిమంది నేడ్పించుచున్నట్లు. కాని, ఒకకట్టెచిక్కు మాత్రము వచ్చుచున్నదోయి! పూర్వపుకవిముండకొడుకులు వ్రాసినవి వాకర్థముకాక చచ్చుచున్నాను.

ప్రతి—కేకలు వేయకు. ఇంద్రజిద్విభీషణులు వచ్చుచున్నారు.

[ప్రవేశము—ఇంద్ర విభీ]

విభీ—కుమారా! తండ్రిగారింకను సభాశాలకు రాలేదు.

ఇం—ఇదిగో! మనశాసకుపు ప్రతిహస్తుడు. ద్విజిహ్వుడు నిందేయున్నారు. తండ్రిగారు వచ్చుసమయమైనది.

ప్రతి—ఓహో! బాబుగార్లా! దయచేయండి! దయచేయండి!

ద్వి—(స్వ) అదిగో! ఇచ్చకాలముండకొడుకు?

(తెరలో)

జయ! శ్రీమద్దేవాంతకనరాంతకసార్వభౌమునకు జయ! పరాక్రమ విజిత ధనాధినాధునకు జయ! త్రివిక్రమాక్ష సమస్త దివిజగణహరి పూజితపాదారవిందునకు జయ!

(రావణుడు ప్రవేశించును.)

అందఱు—పరాక్! దశగ్రీవగజేంద్రా! పరాక్!

రావ—తమ్ముడా! విభీషణా! కూర్చుండుము. కుమారా! మేఘనాధా! ఆసీనుడవుగమ్ము.

విభీ— }
ఇంద్ర } (కూర్చుందురు.)

రావ—ఇదిగో! ద్విజిహ్వప్రతిహస్తులిక్కడనే యున్నారు. నర మాంసదినమున బాగుగ ప్రొద్దుగడచునన్నమాట.

ప్రహ.—చిత్తము. చిత్తము....... ద్విజిహ్వా! నీవు మాటాడవేమి?

ద్వి—నేను నీవలె ముఖప్రీతులాడు శుంఠనుగాను.

ప్రహ—అట్లయిన నేనటరా శుంఠను? చండాలుఁడా!

రావ—సరిగాని, ...... ద్విజిహ్వా! నీకు కవిత్వముతో పాటు ప్రశ్న శాస్త్రమేమైనఁ దెలియునా?

ద్వి—చిత్తము. కొంచెముగఁ దెలియును.

రావ—అబ్బ! నీ కెన్నివిద్యలలో శక్తి యున్నది?

ద్వి—మహాప్రభూ! తమదయవలన నరువదినాల్గు విద్యలలోన సమాన పాండిత్యమున్నది.

ప్ర—మహాప్రభూ! వీనికరువదినాలుగు విద్యలలో శక్తి యున్న మాట వాస్తవము. కాని, వానికఖిలవిద్యలలో శక్తి యున్నది. నేను దేవరవారి మంత్రినగుటచేత సౌఖ్యమందేగాని, పాండిత్యమునందు నన్ను తమరు పరీక్షింపలేదు.

ద్వి—చిత్తము. దేవా! పూర్వము వేదములు వ్యాసమూర్తులై దత్తాత్రేయునాశ్రయించినటులే యఖిలవిద్యలు గాడిదలై వీనినాశ్రయించినవి.

ప్ర—మహారాజా! నిజమే! ద్విజిహ్వుఁడనగా నావిద్యామూర్తులగు నరువదినాలుగు గాడిదలు కలిసిన స్వరూపమని మాట.

ద్వి—నేనుగాడిదనని వీఁడాక్షేపించుచున్నాఁడు. మహారాజా! సెలవైనచో గాడిదెను గావున, మూతిపైనిచ్చి యొక్కటితగులనిత్తునా?

ప్ర—దానవసార్వభౌమా! తన్నుఁదానుగాడిదనని చెప్పుకొనుచున్న యీనీచుఁడు తమ్ముమహారాజాయని సంబోధించుచు మీరుగాడిదలకు మహారాజులని తిట్టక తిట్టినాఁడు. సెలవైనచో నీగాడిద చెవులు గోసివిడిచెదను.

(తెరలో)

చెవులను ముక్కును గోసివిడిచినా పాపాత్ముఁడు? చెల్లెలా! రా! రావణరాజేంద్రుని దగ్గఱకు రా.

ఇం—ఆ! ఆ! అదేమో వినవిందు.

వి—అయ్యో! అదేమి! మనశూర్పనఖ కీభీకరాకారము?

(శూర్పనఖ ఖరదూషణులతో ప్రవేశించును.)

(అనుబంధము. 10)

ఖరు—అన్నా! మాయిద్దఱను వదలుము. దీనిముక్కుగోసిన వాని గొంతుగోసెదము.

దూష—ఓసీ! మాముద్దులచెల్లెలా! శూర్పనఖా! నీయేడ్పు పెద్దన్నయ్యతో చెప్పుకో!

రావ—శూర్పనఖా! హాహా! నీముక్కుచెవులు గోసినవాఁడెవ్వఁడు? అంతటి నిర్భాగ్యుఁ డెవ్వఁడో చెప్పుము. వానినిప్పుడే కరకర నమలి తిందును

సీ. మానంబుదివ్యావి । మానంబుహరియించి
యలకుబేరుని లంక । కవలనెట్టి
తూపులుపదియు వా । ల్వ్యాపులిర్వదినింపి
యలమయుధృతి సుత । నపహరించి
కరదండగతిచేత । కాలదండాహతి
నణగించి యముని దీ । నాత్ముఁ జేసి
గాత్రంబున సహస్ర । నేత్రంబులందున
వజ్రపాణికిరక్త । వారులిచ్చి
పటుభయంబున భువనముల్ । పదియునాల్గు
గడగడవడంకి నిరత మం । జలిఘటింప

ద్విజి—హరిహరా! ఇచ్చకపుమాటలకేమిలే; తరువాత పుచ్చుకొనుట చూచుకో!

రావ—అమ్మాయీ! నిన్ను బరాభవించిన దెవ్వఁడైన స్వర్గమర్త్య పాతాళంబులనెందు డాగియున్నను సరే!, మండితగదాగండంబున వాని భుజాదండంబును పటాపంచలబ్రద్దలుజేసి శాంతినందుదును. సురఖేచర యక్షగరుడగంధర్వకిన్నరాదులలో వాఁడెవ్వఁడో వచింపుము.

శూర్ప—అన్నయ్యా! వాఁడంత దూరపువాఁడుగాడు. నన్ను పరాభవించినవాఁడు కేవలమొక మనుష్యుఁడు.

రావ—హాహ్హాహ్హా! మనుష్యుఁడా! హాహ్హాహ్హా! మనుష్యుఁడా! అమ్మాయీ! మనుష్యునకు భీతిల్లితివా?

అందఱు—హే హే హే హే హే—మనుష్యుఁడా!

(నవ్వుచున్నారు)

విభీ—సభ్యులారా! ఏటికీయల్లరి? మనుష్యుఁడన్నంతనే పెద్దయల్లరిచేయనేల? మహాభయంకరమూర్తియగు శూర్పనఖను పరాభవించు శక్తిఁగలవాఁడగుటచేతనే, మానరుఁడెవ్వఁడో సామాన్యుఁడు కాఁడని బోధపడుట లేదా?

ఇంద్ర—తాతానుజా! ఎవ్వఁడైననేమి? నరుని పరాభవమున కీమెచేసిన యార్భాటము ఒప్పఁదగినదే?

రావ—అమ్మాయీ! ఏమిది?

గీ. భ్రమనహించెనో? నీబుద్ధి బలము చెడెనో?
కొంటిశూర్పనఖవుగావో? దుర్మదుఁడగు
నరుని కరకరములకు నాకుఁదెలుపఁ
గాదలంచితివిది సిగ్గు గాదటమ్మ.

4

విభీ—దానవసార్వభౌమా! ఆనరుని నామరూపాదులను, మన చెల్లెలెఱింగియుండెనని—

రావ—అమ్మాయీ! వాని పేరేమి? వానిరూపమేమి?

శూర్ప—అయ్యో! వానిపేరు మాసిపోను. వానిరూపము మండిపోను. నన్నింత జేసినవాఁడిన్నాళ్లింకను బ్రతికియుండుట నాకు సిగ్గుగాదుగాని, అన్నవని నీతోఁ జెప్పుకొనవచ్చుట సిగ్గా? వాఁడు నా పైనమోహమునఁ బడఁగా నేను సమ్మతింపక పోవఁగా వానితమ్ముఁడు నాముక్కు చెవులు గోయుటను నీతోఁ జెప్పుకొనుట నాదితప్పా! కాక వానివెంటనున్నఁదగులో, స పోఁద్మంటివా? నరుఁడని మీకింతనిర్లక్ష్యమా! ఇందరుండియు నాకేమ్పుతప్పలేదే! అన్నవు; దేవతలను బెదరించినవాఁడవు; పదితలలుగలవాఁడవు; నీవేమో మిడుకుదువని, నేను నీతో మొఱబెట్టుకొనఁగా నన్నే చీవాట్లు పెట్టసాగితివా! ఇంటను, బయటనుఁగూడ నవమానింపఁబడిన నేను బ్రదుక నేల? అన్నా! ఖరా! నాకు సముద్రమునకు దారిఁజూపుము అందు మునిఁగిచచ్చెదను.

(ఏడ్చుచున్నది.)

ద్వి—(తన) మూఁడుగడియలలో సముద్రము దాటి చని ముక్కుఁగోయించుకొని వచ్చి ముండకు దారి యింకొకరేలచూపవలెను?

రావ—శూర్పణఖా! నీశత్రువుం జంపఁ జాలనంటివా? వాని యునికియు రూపము నెఱింగింపుము. ఇఁక శాంతింపుము.

ఖరు—సోదరా! దానవసార్వభౌమా! మీరీవృత్తాంత మరయుచుండుడు. మేమానరపురుగుల జాడ నెఱుంగుదుము వేగ సంహారించివచ్చెదము,

రావ—ఖరదూషణులారా! అట్లేకానిండు.

ఖరు— }<br>
దూష— } ప్రస్థానము.

ఇంద్ర—అత్తా! వారివృత్తాంతముం దెలుపుము.

శూర్ప—ఈతాకులపర్ణశాలలో, నీలిమందురంగు వాఁడొ కఁడు; చిందూరపురంగువాఁడొకఁడు; అందమైనయామ్మదానిని దెచ్చి నారు. అన్నా! రావణా! ఆయాఁడుది నీకుతగినదిరా!

ద్విజ—హే హే-హే అమ్మాయిగారికి ముక్కుపోయినను, బాబుగారికి ముద్దులాడి దొరికినసంతెచాలు.

రావ—శూర్పనఖా! ఆవన్నెలాడి యెట్టిసౌందర్యముగలది?

శూర్ప—అన్నా: దానిమొగముచ్చడము-దానిపెదవి దొండ కాయ! నివిదివఱకు తెచ్చిన యేయాఁడుదియు, దానికోటిపాటిసేయదు. అప్సరాంగనలు దానిపై బలాదూరు.

విభీ—అమ్మాయీ! ఆడుదానవు; మగవాలివి; నీకీ సంభాష ణము తగనిదిసుమా?

రావ—విభీషణా! మనశూర్పనఖకింకను జిన్నతనము! కావున నంతవివేకముగ మాటలాడుట తెలియకపోవచ్చును;.— అమ్మాయీ! ఆనరులపేరేమి?

శూర్ప—ఒకనిపేరు రాముఁడఁట! ఇంకొకనిపేరు లక్ష్మణుఁ డఁట! దశరథునిపుత్రులఁట! వారి దయోధ్యయఁట. ఆవనిత రా మునిభార్య సీతయఁట!

రావ—ఏమీ! జనకతనయ సీతయా! పహస్తా! వెనుకనొక మారు మనమీసీతాస్వయంవరమునకే కదా వెళ్ళినది!

ప్రహ—మహాప్రభూ! చిత్రము.

ద్వి—(అప) అవమానముకూడ నప్పుడు జరిగినట్లు జ్ఞాపకము!

ప్రహ—(అప) ఛీ! శనువా! అమాట లిప్పుడేల?

రావ—అమ్మాయీ! ఆడుదానవగు నిన్ను పరాభవించిరి గావున, వారియాడుదానిని నేను పరాభవింతును. నీవిఁక నంతఃపురమున కరుగుము. ఆహా! చాలును శ్రీఘ్రణానాదముగ వినఁబడియె. నాఁడు జనకరాజేంద్రుఁడు స్వయంవరము సాటించినప్పుడు సకలరాజులలోఁ దలవంపుగా నాకుఁ బరాజయమును, నీరామునకు విజయమును గలిగెఁ గదా! కానిమ్ము అప్పుడు తప్పినను సీతకుముదాలింగన మిచ్చునప్పుడు తప్పదు. శూర్పణఖా! నీవరుగవచ్చును

శూర్ప— [ప్రస్థానము.]

రావ—ప్రహస్తా! రాత్రియు జాగ్రత్త నేను మాయాబలమా గిచుండగు మారీచుని యాశ్రమమున కేగి సీత నెట్లు పొందఁదగునో యాలోచింతును; మీరందఱు జాగ్రత్తగ నుండుఁడు.

విభీ—అన్నా! క్షమింపవలయు నాదొక ప్రార్థ

రావ—తమ్ముఁడా! ఏమి?

విభీ—

సీ. పదియునాల్గేఁడుల । పసితనంబునఁ దాట
కాంతకుఁడై కీర్తి । నందినాఁడు
ధరణీశవంశకాం । తార నావాసలు
పరశురామునిభంగ । పఱచినాఁడు
కనుమూసి తెఱచినం । తలో హరచాపంబు
సంచితశక్తిఖం । డించినాఁడు
కౌశికుయజ్ఞంబు । గాపాడువేళ సు
బాహుని జీవంబు । బాపినాఁడు
ఇచట నారదమౌని । యనేకమార్లు
భగవదవతారమితఁడని । పల్కినట్టి

విభీ—వినఁదలఁచితివి; కన్గొనఁదలఁచితివి; అనుభవింపఁదలఁచితివి

ఇంద్ర—దానికేమి లెండు—జయాపజయములను నిర్ణయము చేయుటకు, మీరే సమర్థులుగారు; మీమాటలకు భయపడువాఁడనుగాను.

విభీ—భయము, నామాటలకుఁగాదు; రాముని వ్రేటులకు.

ఇంద్రి—

అబ్బ! రాముఁడు—గీముఁడు—ఎంతసేపటినుండియు నీనరకీటకమును మాగధునివలె స్తుతించుచున్నారు. వినలేక చెవులు చిల్లులుపడుచున్నవి. మనస్సు పుండుపడినది. అరకాలిమంట బ్రహ్మరంధ్రమునకుఁ గొట్టుచున్నది. పెద్దవారనిసహించి నోరుమూసికొని, తండ్రిగారి ముగముచూచి—కోపమణచుకొంటిని. రామకథాస్తోత్రము నింత సేపటినుండియు, విధిలేక వింటిని. ఇఁక సహింపను. మీరు రామునిపేరెత్తవలదు. పదునాలుగులోకములను గడగడలాడించిన రావణరాజేంద్రుని చెల్లెలఁట. ఒకనరాధమునిచే పరాభూత కాఁగా నోరుమూసికొని లజ్జలేక పౌరుషములేక ఆముక్కిడిదాసిమాత్రమైన చీమకుట్టినంత చింతయైన లేక నూరకుండవలసినదఁట హి—హి—హి—హి—హీ

విభీ—ఛీ! బాలకా! మేఘనాధా! ఛీ! నీకేమి తెలియునురా! ఇంకనుఁ గన్నులైన పూర్ణముగఁ దెరచితివంటగా! అప్పుడే పెద్దలదూషింతువా? కారులేల ప్రేలెదవు? రామునిజంపుట, నీతరముగాదు, నీ తాతతరముగాదు. రావణా! నాపలుకులువినుము. చెడకుము; సీతను దెచ్చుతలంపుమాత్రము మానుము.

రావ—విభీషణా! ఏమిది? నేఁడు న్యాయమూఁడ వైతివో నాపరాక్రమమెఱుఁగవో విభీషణుఁడవే కావో ఏటికీయుపన్యాసము? ఏటికీవాగ్వ్యయము?—

కవిరాజవిరాజితము.

సురగరుడోరగ కాంతలఁ దెచ్చితి శుద్ధతలంబుల నుంచుతినా
సురపతులను చెరనిడి, కడువడి, కను శోభలనందుచు నుంటినిగా!
హరిహరులజుఁడును, నమరపతియు, నా యంతకుఁ డింతయు, భీకరసం
గరమున డీకొని గెలువఁగ జాలరు; కారణ మేలెద వేటికిరా?

విభీ—అసురాధ్యక్షా! ఆగ్రహింపకుము; మన కేదియో వినాశముగల్గిన సూచనలు దివబుకేఁ కల్గినవి దానికిఁ దోఁపుగ, మీకిట్టి బుద్ధియుఁ బుట్టినది. లంకకు రాఁబో ప్రకీర్ణము, పశుపక్షి క్రిమికీటక పంచభూతములు సూచించుచున్నవి.

సీ. నవనాజ్య కలశంబు లదివెలుక్రిమికోటి,
  త్రేతాగ్నిగణముఁ దీప్తులార
నంబుదసంఘంబు లస్రంబువర్షించు
  గబ్బిలంబులు గ్రహ క్రిములవేఁతె
కాలాంకనమునఁ జండకరుకు విభాసిల్లె
  ఘనభీమగతి ధాత్రి కంపమందె
కూయు జంబూకము లగ్గాడి సంధ్యల యుంగా,
  ఏకచుక్కలు నిట్టు దోఁచెఁదరుచు,
క్షీరదానలవము సేయవు, గోవులు
కంధరంబులేసి కాలశక్తి
రాత్రిలంను దిరుగు రౌద్రస్వరూపియై
విలయసూచకంపు విధముగాఁగ.

రావ—విభీషణా: నీవెట్టియోగాని, నామతిము నరల్ప నీతర మగునా? చిరకాలమునుండియు నిసీలపై నేను కన్ను వేసియుంటిని. సమయము దొరకినప్పు డట్టిదానిని వదలెదనా?

ఆ. అసురవీరులెల్ల ౹ హతమైనసరియె, రా
మాస్త్రవితతి మచ్చ ౹ రాళి దూల్చి
లంక నంబురాశి ౹ గ్రుంకించినను సరే
పుడమిసుతను విడువ ౹ విడువనయ్య.

విభీ—మీకు మాత్రమీ వెఱ్ఱితనమేల ? ఎన్నటికైన జానకి మీకు మాత్రము దక్కదనుకొంటిరా ?

గీ. బాడబానల శిఖచల్ల ౹ బడిన సరియె
నినుడు చంద్రుడు భూమిపై ౹ బడిన సరియె
ధరణి గిరగిరదిరిగిన ౹ సరియె; సాధ్వి
సీత తథ్యంబుగా మీకు ౹ జిక్కదయ్య॥

రావ—సరే ! కానిమ్ము; విభీషణా ! అట్లే కానిమ్ము. ఆసీత దొరకకుండునేదో నేనును చూచెదను. ఇంక నాకు నీమాట వప్తా వింపవలదు.

విభీ—తమచిత్తము.

రావ—ప్రహస్తా ! నేటికి కొలువు చాలింతము. తెల్లవారు జామునకే నాకు మారీచాశ్రమమునకేగదగు రథము సిద్ధపరపుము

ప్రహ—భాగ్యము

(అందఱు ప్రస్థానము.





శ్రీ

# సుగ్రీవపట్టాభిషేకము

## తృతీయాఙ్కమ్.

### ప్రథమదృశ్యము—పర్ణశాల.

ప్రవేశము—సీతా, రామ, లక్ష్మణులు.

రాము — జానకీ! ఔను. నీవనినట్లు, స్వప్నములు కేవల మనఃకల్పితములుగావు ఒక్కొక్కప్పుడు నిజములేయగుచు. ఐనను, నీవు గాంచిన, స్వప్నవృత్తాంతమేమి?

సీత — నేటి రేయి వేగుజామున, ద్విజకులకలకలారావంబులు దిశల వినంబడువేళ నెప్పటియట్లు మెలకువరాక, నన్నెక్కడనుండియో పాడునిద్రవచ్చి యావహించెను.

లక్ష్మ — అమ్మా! ఎక్కడనుండియో యననేల? మొన్న పగలంతయు కాకాసురులతో మనమందిన యలమటచాలదే?

రాము — జానకీ! అప్పుడేమైనది?

సీత — అప్పుడు నాకొక్క స్వప్నమువచ్చెను; అందు —

గీ. కామరూపులు, దనుజులు, కేక చురథము
లెక్కకు మునాల్గువేలు, బకేలీయులగుచు —
శాణబాణాసనములతో, కేభండన ప్ర
చండసంగ్రామతలమున కేసమసినట్లు.

రాము—వైదేహీ! ఇదేమి? ఎవరిచేనవమసిరో వచింపక పోయితివి!

లక్ష్మ—మహాప్రభూ! క్షమింపవలయు—

గీ. నలుమొగంబుల పద్మసం। జాతుఁ డజుఁడు;
వేయిమొగముల శేషుండు। విశ్వమోహ
నప్రమోదులౌ తమ్ము వ। ర్ణనము సేయఁ
జాలరన, నే ముఖస్తుతి। సలుప గలనె?

(తెరలో)

సలుపకేమి? తమ్ముఁడా! దూషణా! మనశూర్పణఖకాపాపులుచేసిన దోసఁగు మనరోమరోమకూపంబుల సలుపుట లేదా?

సీత—(భీతితో) ఆర్యపుత్ర!—ఆర్యపుత్ర!!—

లక్ష్మ—అమ్మా! భయపడకుము. మహాపతివ్రతవగు నీస్వప్నము ప్రత్యక్ష మగుచున్నది. మిగతపనియు నీమహాత్మ్యముచేఁ దీరఁగలదు.

రామ—సౌమిత్రీ! జానకిని దూరముగఁ గొనిపొమ్ము. కర్ణనాసికాచ్ఛేదనము నందిన. దనుజకాంతవక్షమునుండి వచ్చుచున్న శాతనులగుంపువలె నున్నది. సుకుమారియగు, నీకాంతకదనరంగముం గాంచి సహింపఁజాలదు.

సీ. వీణాస్వనములకు। వెఱగందు సుందరి,
జ్యాటంకృతులకు, భీ। తాత్మయగును?
వనజరేణువులకు। కనులు మూసెడు లేమ,
రింఖారజముల కు। ద్రేకపడును?
పన్నీరువాన సై। పఁగలేని కోమలి
శోణవర్షముఁ గాంచి। దీనయగును?

భ్రమరఝంకారవి భ్రమములోర్వని గోల,
దనుజార్భటుల కెంత తల్లడిలును?
కుసుమపాతంబునకు మదిఁ గుందు చెలువ,
శరనిపాతంబుఁగని, యెట్లు సైపఁగలదొ?
భయదరిపుకోటిఁ బరిమార్చి వచ్చుదనుక,
కాచియుండుము తమ్ముఁడా! కాంతనచట—

సీత—నాథా! క్రూరదానవులతోడ భయంకరమగు సంగ్రామము మనకు ప్రాప్తించినదనినంతోడనే, నాగుండెలు తల్లడిల్లుచున్నవి.

లక్ష్మ—అమ్మా! ఎంతవెఱ్ఱిదానవు?

ఉ. దానవులైననేమి? ఖలదైత్యసమూహములైననేమి? యీ
మానవనాథ జన్మకిఁక మానునె? వీరవిహారకార్యముల్,
కాననవాసమందున, సుఖంబులు గల్గునె? నాందియయ్యె; నీ
మానితనాటకంబునకు మానదు యుద్ధము మంగళాంతమున్

రాము—జానకీ! దానవులు సవిధభూములకువచ్చినారు; నాకే భయమును లేదు. ఈలక్ష్మణకుమారుఁడు నిన్ను పరిరక్షించును. ఇతనితో దూరముగ నరుగుము.

సీత—నాథా! మీకు సదా మంగళ మగుఁగాక! రాక్షసులతోడ యుద్ధంబున కడుజాగరూకతతో మెలంగుఁడు

(సీత, లక్ష్మణుఁడు ప్రస్థానము.)

(ఖరదూషణులు సాయుధులై ప్రవేశించుదురు.)

ఖర—
దూష— } ఓరి మానవపిపీలికమా! నీవఁటరా మాచెల్లెలి ముక్కుచెవులం గోసినది? రే! ఆయుర్దాయహీనుఁడా! నీజీవితం

బీక తుదిముట్టినది. నూఱుదునాలుగు వేలకంచురథంబులతో యుద్ధము సేయుము రమ్ము.

రాము — లోకకంటకులారా! ఇమ్మిప్పుడే హతమార్చెదను; రండు.

(అందఱు ప్రస్థానము.)

ద్వితీయదృశ్యము — మారీచాశ్రమము.

ప్రవేశము — మారీచుఁడు జపము చేసికొనుచుండఁగా రావణుఁడు.

రావ — (దగ్గఱకేగి) మామా! సీయాల్లుఁడు రావణుఁడు నమస్కరించుచున్నాఁడు.

మారీ — ఇష్టప్రాప్తిరస్తు. దానవేంద్రా! రాకరాక రాకపోలె నాయాశ్రమంబునకు వచ్చితి వేమి? నీ క్షేమంబులు గలవే?

రావ — మామా! మారీచా! దా ఫలము; మనకుని క్షేమము కేమిగొఱంత? — ఇప్పుడు ముఖ్యముగ నీసహాయము పేక్షించి నీకొఱకు వచ్చితిని.

మారీ — దానవేంద్రా! అది యేమి?

రావ — విన్నవించుచున్నాను. మారీచా! ఇది నీకు సహాయము పగఁదీర్చుకొనుటకు మంచిసమయము. ఱుయింటికుఁదేటివలె పూర్వవిరోధయొకఁడు మనచేజిక్కినాఁడు.

మారీ — రావణా! ఎవ్వఁడా పూర్వవిరోధి

రావ — సీ. బాఁడైననూఁడని పూతనాయమునని
తల్లిఁగూల్చిన బల్లిగుండు
కౌశికుయజ్ఞంబు గాపాడువేళ ని
సోదరుఁ దున్నించిన శూరవరుఁడు

రావ—మారీచా! ఏమిది? వింతగామాటలాడితివి? నీవింతవాడింతువని, సుంతైననెఱుంగనే? ఎంత వెఱ్ఱివాఁడవు? నన్ను యముఁడు శిక్షించువాఁడా? యమునిఁబట్టి శిక్షించి ప్రాణావశిష్టునిఁ జేసినమాట మఱచితివే;

గీ. అతిభయంకర బాణ బా ॥ ణాసనముల
యమునిగడగడలాడించి ॥ యమరకోటి
గాందిశీకులఁ జేసిన ॥ ఘనచరిత్రి
మానసంబున మారీచ ॥ మఱచినావా?

వినను, మారీచా! నాపాపపుణ్యాచరిత్రలను నీవిప్పుడు తలపెట్టఁదగదు.

మా—రావణా! ఈదుష్కార్యమున నేనునీకెప్పుడు సహాయుఁడనగుదునో, తత్పాపములును సమానముగ నాయవియేకదా! ఇటు రాముని చేతనో, అటుయముని చేతనో, నాకు శిక్ష తప్పదుగదా!

రావ—మారీచా! నివిటు రామునివలనను శిక్షనందవలదు; అటు యమునివలనను శిక్షనందవలదు.

మారీ—రావణా! ఈకుష్కార్యమున నయితె మట్టెనిరపాయోపాయము గలదా?

రావ—కలదు; వినుము. కాంతలకు వనములందుండు మృగాదులపై నాసక్తివిశేషముగ నుండును గావున, నీవొక హేమకురంగాకృతిందాల్చి సీతకుభ్రమఁగొల్పుము రాముఁడు దానింబట్టఁదలంచిన నదృశ్యుఁడవుగమ్ము. ఈలోపల నేను జానకి నపహరింతును.

మారీ—వెఱ్ఱివాఁడా! రాముఁడు చనినచో, సీతారాములను కంటికి రెప్పవలెఁగాచులక్ష్మణుఁడు లేఁడా?

రావ—దానికొక కపటముం బన్నుము. అదృశ్యమగునప్పుడు సీతాలక్ష్మణా యని కేకలిడుము. అదివిని లక్ష్మణుఁడు సీతనువిడిచి రామసహాయమున కరుగును.

మారీ—అదృశ్యమగునప్పుడు గాదు; హతమగునప్పుడనుము హరహరా! రావణా! నీకెన్ని కపటోపాయములు ఎన్ని మాయోపాయములు. ఇవియన్నియు నాత్మనాశనమునకే సుమా! రామమూర్తి నన్ను జీవములతో విడిచినఁగదా, నాకు రామునిచేతను, యమునిచేతను, దండనము లేకుండుట? సీతాపహరణమునకు మూలకారణుండనగు నాకు తత్పాపము గలుగదని ధర్మశాస్త్ర ముపదేశించుచుంటివా? రావణా! కాంతానురాగము తుదకు నిన్నట్టిమూఢునిగఁ గావించెనా? శ్రీరాముఁడాదినారాయణుఁడని యిఁకనైన గ్రహింపఁజాలకుంటివా! అతనితో వైరముం బెట్టుకొనిన దైత్యదానవు లనేకులు తొల్లి నిహతులగుటైన నూహింపవా? తిరిగి నీతలగోకుకొనుటకు సైత మీకాడవలియే దొరకినదా? రావణా! సీతను బట్టి తెచ్చితివేని నీకు నాశనము తప్పదు; నీ లంకకు నాశనము తప్పదు; ఐనను రాముఁడు నీకేమివిరోధ మొనరించినాఁడు? సీత యేమిచేసినది

రావ—ఛీ! మూఢుఁడా! రాముఁడు చేసినయపకారము నేనీవు గుర్తింపఁజాలకుంటివా! నాముద్దుచెల్లెలిముక్కుగోసినవానిని ముద్దు బెట్టుకొమ్మంటివా? ఆడుపడుచు నవమానించినవాని నాదరింపుమంటివా? ఛీ! పౌరుషహీనుఁడా! దానవకులకళంకా! ధర్మవేత్తవోలిక నాకుపన్యాసము లీయవచ్చితివా! నాకు సేవచేయవలసిన యధముఁడవు, నన్ను దూషింతువా? నీకు రామబాధ యైనసరే, యమబాధయైనసరే, మరేబాధయైనసరే, నిప్పుడండకారణ్యమున కేగకతప్పదు; నేనాదేశించిన కార్యమొనరింపక తప్పదు; నీవిందులకు మారాడితివేని యీఖడ్గముచే నీశిరస్సు ఖండించెదను.

(కత్తి నెత్తును.)

మారీ—రావణా! కత్తి నెత్తినంతనే గడగడవణకి నీపాదములం బడుదుననుకొంటివా? అనుభవింపఁదగిన సమస్తభోగముల ననుభవించి.

తిని. పెద్దవాఁడవగు నాపై కత్తినెత్తరాదను సుబుద్ధి నీకే లేనపుడు నీకత్తికి జంకుదునా! నాకింక నీభోగములపై నాశ లేదు. ఈరవంతగాలి యెప్పుడైనఁ బోవలసినదే! పాపకార్యావలంబనుఁడవగు నీకనుభవము తప్పదు; నీవినాశనమునకీ శూర్పనఖయే మూలమనుకొమ్ము. ఇంట నుండదగిన పొలఁతి తిరుగుమనసి దేశములవెంట దిరిగి మగవారితో సరసము లాడుట దోషమని దానిచెప్పునఁగొట్టక నీచపాపకార్యములకు బాలుపడిన నిన్ను నేనేమందును. అనుభవింపుము. సర్వపాపములకు ఫలమనుభవింపుము. రాముఁడే పుత్త్రమిత్త్రకళత్త్రములతో నిన్ను వధించును లెమ్ము తుదవేళకైన నాపలుకులు జ్ఞప్తికివచ్చును; పాపాత్ముఁడవగు నీచేత నేఁ జావనేల? నాకెల్లను మరణము తప్పదు; ఆరామమూర్తి బాణముచే నేచచ్చి స్వర్గమునందెదను. రావణా! పోయెదను; నేను నిన్నిఁకఁ జూడఁజాలను.

ఇద్దఱు నిష్క్రమింతురు.)

చతుర్థదృశ్యము.—పర్ణశాల.

(సీతారామలక్ష్మణులాసీనులై యుండఁగా)

లేడి ప్రవేశించును

సీత—నాథా! బంగారుపుశరీరవర్ణముతో చెంగుచెంగున నెగురు నాకురంగముం దిలకింపుఁడు; దానిని ప్రాణములతో నాకు దెచ్చి యిచ్చిన నాడుకొందును గదా!

రాము—ప్రాణేశ్వరీ! దీనికింత వేడవలయునే? రామబాణమునకొక కురంగము ఘనమా? ఇప్పుడే తెచ్చియిచ్చెదను సెలవు ము—

(పోఁబోవును.)

లక్ష్మ—అన్నయ్యా! క్షమింపవలయును.

రామ—తమ్ముఁడా! ఎందుచేత?

లక్ష్మ—తమ గమనమునకు నే నవరోధముఁ గలిగింపఁ దలంచు కొన్నందులకు.

రాము—సౌమిత్రీ! ఇది యే మంత పెద్దవిషయము?

గీ. వనములం దునజరియించు మనకు లేళ్ళు
గన్పడుటవింత యే? దాని కాంత వేడ
నేను దేఁజను టబ్రమే? దీనికింత
గా క్షమాపణమేల యుగ్రమన మేల?

సీత—ఏమిది? లక్ష్మణా! శకునపక్షివలె నిలచితివి? బంగారు లేడి కడుదూరమరిగెఁగదా?

లక్ష్మ—అమ్మా! మన్నింపుము; నేను శకునపక్షి నగుట నిజమే! అగ్రజా! లేడి యేమి బంగారువన్నె గలదగుట యేమి? జీవములతో నుండుట యేమి? మహాభయంకర రాక్షసాకులమగు నీవనమున, మనము తప్పక మోసగింపఁబడితిమి. కామమోహితయై వచ్చిన రక్కసి ముక్కు చెవులఁగోసి పంపిన తరువాత, దాని సోదరులు ఖరదూషణులు మనపై కెత్తివచ్చి యీపంచవటీతీరమున, మొన్నగదా వధింపఁబడిరి. ఇదియు రాక్షసమాయ యని తోఁచుట లేదా?

సీత—ఆహాహా! ఏమి విపరీతసిద్ధాంతము నుత్పాదించితి వోయి మరదీ! నీ నీడఁజూచుకొని నీవే బెదరెద వేమి? రక్కసులు శౌర్యమున మన పైకి వచ్చెదరు గాని, యీవిధముగ లేళ్ళు కోళ్ళయి వచ్చెదరా? లేడి చెట్లన్నియు రాక్షసరూపములే యందువుగాఁబోలును?

లక్ష్మ—అమ్మా! దాసుని తప్పు క్షమింపుము;

రాము—తమ్ముఁడా! భయము లేదు; రాక్షసుఁడే యయినను భీతిల్లవలసిన పని యేమి రామబాణముల చవిని? ఖరదూషణులతో పాటుగా చూడఁగలఁడు; నీవు శ్రద్ధతో జానకి నరయుము.

లక్ష్మ—భాగ్యము; తమరు జాగ్రత్తగఁ జూడవలయును.

రాము—అట్లేచేసెదను; నీవుమాత్రము జానకిని వీడవలదు.

లక్ష్మ—భాగ్యము.

రాము—(నిష్క్రా)

సీత—లక్ష్మణా! ఆలేడియందమెంతని వర్ణించినను ముచ్చటగనే యుండునుసుమా?

గీ. తనువు బంగారుపూతపూసిన విధమున
నింపెసంగఁగ, దానిపై కెంపులట్లు
చుక్కలటనట శోభిల్లఁ జూడచోద్య
మైనహరిణంబు క్షణములో నవలదాఁటె.

(తెరలో)

హా సౌమిత్రీ! హా సీతా!

సీత—ఆ! ఆ! ఏమిది? సౌమిత్రీ! అది మీయన్నగారికంఠస్వరముకాదా?

లక్ష్మ—అటులనే యున్నదమ్మా!

సీత—అయ్యో! అటులనే యని నిలువఁబడెదవేమి; వెళ్లు. బాణములు పొదిలోనుండితీయుము; విల్లెక్కుపెట్టుము.

లక్ష్మ—అమ్మా! క్షమింపవలయు; అన్నగారియానతి మిమ్ములను వీడవలదని—మీదగ్గఱ మేమిద్దరము లేనిసమయమున, నేదైన నపాయము సంభవించిన నెట్లు?

సీత—అయ్యో! ఇంకను స్తంభమువలె కదలకుంటివేమి? శ్రీరంగనీతులకు నికిదియా సమయము! నీకపాయమా? —నాథునకే యపాయము రానైయుండ నన్నడిగినవారెవ్వరు? ఆవలమనము బ్రదికి యెందులకు? అయ్యయ్యో! అడవిలోనాథునకేయపాయమువచ్చెనో

గదా! లక్ష్మణా ! నన్ను బ్రతిమాలుకొందును. నీకు నమస్కరింతును వెళ్ళు—తండ్రి! వెళ్ళు—

లక్ష్మ—హరిహరీ! హరిహరీ! ఏంతమాటతల్లీ ! జగద్భద్రకరుండగు రామభద్రునకు కీడేమి, నాతోడేమి?

సీత—అట్లయిన నది మీయన్నగారిస్వరమే కాదందువా ?

లక్ష్మ—కాదు. తల్లీ! కాదు—అది దానవుని కేక! మనలను మోసగింపఁబన్నిన వన్నుగడ.

సీత—ఛీ! ఛీ!—అసందర్భమున నమ్మఁదగనిమాటల నాడెద వేమి? నీకడుపులో నేమైన మాపై దురుద్దేశముగలదా? ఆమాటయు యినఁజెప్పుము ! నేనైనఁ బోయి, నా నాథుని తుదసారిచూతును.

లక్ష్మ—హా హా!నిర్భరము; తల్లీ! అశ్లీలము లెందులకు ?

సీత—కాక, జరుగుచున్న కార్యము లేమి? పోనిమ్ము నన్ను పోనిమ్ము;

లక్ష్మ—క్షమింపుము. తల్లీ! నిన్నొంటిగా నీవనమున, వదలుటకుఁ గాని, నేను వెడలుటకుఁగాని రామాజ్ఞ లేదు.

సీత—హాహా! ఏమిది! తుదసారి నేను నానాథునిగూడ చూచుకొనలేనా? దానికిని నీబంధనమే నా? తులువా! లక్ష్మణా! నీ దుర్బుద్ధిని గ్రహింపఁజాలక చెడితినిగదరా !

ఛీ! ఛీ! చాలు!—నీ కల్లవినయములను నేటితోఁ దెలిసికొంటిని ! అన్నగారియవసానకాలమున గరిటెడుగోదావరీతీర్థమునైన గొంతులోఁ బోయఁదలంపవు; సరిగదా. నన్ను పోయనీయవా? భరతుని ప్రోత్సాహమున, నాలుమగలనెడఁబాప వనమునకువచ్చితివా? అంతఃపురమును వదలుకొంటిమే; రాజ్యమును విడిచితిమే. సౌఖ్యము

లన్నిటిని వీడితిమే? ప్రాణములు తప్ప మరేమియు లేవే! మేము నీకును భరతునకును నేమిద్రోహము చేసితిమి? మమ్ముచంపి మీనెత్తి నేమి కట్టుకొందురు? ఓ బంధుఘాతుకుఁడా! పాపాత్ముఁడా!

లక్ష్మ—రామ రామా! ఎంతెంతమాటలను వినుటకు బ్రతికియుంటిని! శ్రీరామచంద్రా!

సీ. చావనైయున్నట్టి । జనకుని నెడబాసి
జనయిత్రులనుఁ బాసి । సతినిఁ బాసి
గురుజనంబులవీడి, । కోమలతనుసుఖం
బును వీడి సాకేత । పురము వీడి
నాదైవమును నీవె । భర్తుఁడవు నీవె
తండ్రియు నీవె నా । తల్లి నీవె
యనుచు నిద్రాజలా । హారంబులను రోసి
తమ్ముఁడ దాస్యమే । ధర్మమంచు
చేతనైనట్లు మీసేవ । చేసికొనుచు
దినములను బుచ్చుచుంటి నా । దినవిభుండె
యిందులకు సాక్షి; మీమనంబె యొక్క సాక్షి!
వన్యమైన చరాచర । ప్రతతిసాక్షి.

అమ్మా! అమ్మా! నే దుర్మార్గుఁడఁ గాను; మీ పాదకైంకర్యతత్పరుండను. స్వప్నమందైన సందేహింపఁదగదు. అనవసరాందోళనము మానుము. రామచంద్రమూర్తిదర్శన మిప్పుడే యగును.

గీ. ఎద గలుషగంధలేశంబు । నెఱుఁగ నమ్మ
తల్లిరో! నీదు చరణప । ద్మములతోడు
మాన్యగురువసిష్ఠాంఘ్రిప । ద్మములతోడు
తండ్రియగు రాముపాదప । ద్మములతోడు.

సీత—అబ్బ! ప్రమాణమే చేసితివా! తలయెత్తి నావంక చూచి మాటాడ వేమి?

లక్ష్మ—అమ్మా! సర్వదా మీపాదాంగుష్ఠదర్శనమునకు దప్ప నాకంతకన్న కృతార్థత యేది?

సీత—నీవు నా మొగము మేలచూతువు? దొంగ నిర్భయముగ మాటలాడఁగలఁడా? నిన్నా రాక్షసులచేఁ గడతేర నాతోఁ గులుకవలయునని తలంచుచుంటివేమో కాని, పాపచింతనుఁడవగు నీవు నాదరికి వచ్చునప్పటికి, పాదాదిశిరఃపర్యంతమొక్కమారుగ భగ్గున మాడిపోవుదువు.

లక్ష్మ—రామా—రామా—రామా—ఇఁక చావఁదగినదే! వినఁదగినమాటలు సంపూర్ణములైనవి. శ్రీరామచంద్రుని యాజ్ఞ నతిక్రమించి—నాచావునకైన సమ్మతించెదనుగాని, యీమాటలువిని చావఁజాల! అమ్మా! ఇప్పుడే పోవుదును. అమోఘవచస్ఫూర్తియగు శ్రీరామచంద్రమూర్తి మన యెడబాటును శూర్పణఖాభంగమునాడు సూచించియే యున్నాఁడు. నేను మిమ్ము బాసిన తరువాత మీకు మహాపదలు తప్పవు. తప్పవు. తల్లీ! నీనొసట కష్టములను విధిలిఖించియుండ, నీవేమి చేయుదువు? అయినను, తల్లీ! జాగ్రత్త! దుష్టదానవుండెవ్వఁడైన దరియవచ్చిన గీటుదాటకుము. (గీయును)

సీ. నీయింటికోడలి । నిఖిలమాతను సీతఁ
బాలింపవయ్య! భా । స్వంతమూర్తి!
అల్లుఁడా గతిమృషా । హరిణంబు గొనితేర
జనియె కూతును గాచు । కొనుము! ధరణి!
చెడుగు రాకుండ నా । శీర్వాదశతకంబు
గురియఁజూడరె కుల । గురువులార!

యిడుములుదోలగించి ॥ యీసాధ్విఁగావరే,
రఘువంశదేవతా ॥ రాజులార!
భూతపంచకంబ ॥ పుణ్యాస్వరూప నీ
సతినిబ్రోవమీకు ॥ సమయమిదియె
రామదార! రామ ॥ రాజేంద్రుసతి యీమె,
రాక్షసారి! రామ ॥ రక్షయీమె.

తల్లీ! జానకీ! ఏమిపాపమో కాని నేనేగిన వెనుక మీకు మహోపద్రవమగునని తోఁచుచున్నది. తోఁచి, వినియోగమేమి? కర్మము, ముక్కునకు నన్ను త్రాడువైచి లాగుకొనిపోవుచున్నది! ప్రారబ్ధమున కార్యములు జరుగును గాని మనప్రయత్నములు సున్న; అమ్మా! సెలవు. దయయుంచుము; తిరిగి దర్శనమెన్నటికో గదా! తల్లీ! భద్రము భద్రము భద్రము. ఈయడవి ఘోరమృగబహుభుజపరాక్రమాన్వితము. జాగ్రత్త-జాగ్రత్త-జాగ్రత్త;

(ప్రస్థానము.)

సీత—ఏమి? లక్ష్మణుఁడిట్లాడె నేమిచెపుమా! రాక్షసమాయల నెఱింగియే యిట్లనెనేమో? నేనాతని మనసెంత నొప్పించితిని? పాపము.

[మాయరావణుఁడు—ప్రవే]

రావ—. భవతి! భిక్షాం దేహి! భవతి భిక్షాం దేహి!

సీత—బ్రాహ్మణోత్తమ! మీరెవ్వరు?

రావ— స్వ) రావణుఁడని చెప్పక మారుపేరు చెప్పుకొనుట లోపమే కాని కామము ననుసరించి తప్పులేదు. (ప్రకా) సీతా! నీపతి రామచంద్రునికడనుండి

సీత—మహాత్మా! మమ్ములను మీరెట్లెఱుంగుదురు?

రావ—మునులు దివ్యదృష్టిచే సర్వవేదులని యెఱుంగవా! నీ భర్త మారీచగదచే మూర్ఛిల్లియున్నాఁడు.

సీత—(ఆందోళనమున) ఆఁ! ఆఁ! ఏమి? మహాత్మా! ఏమి?—

రావ—ఆందోళనపడకుము! మామంత్రశక్తిచే నాయుపద్రవము దాటినది! కాని మరొకటి కాచుకొనియున్నది; దానినిఁ దప్పింప వచ్చితిని.

సీత—మహాత్మా! మీకుఁ గడుపుణ్యముండును. ఆయుపద్రవమేమో తెలుపుఁడు.

రావ—రావణుఁడు నిన్ను సంహరింప నిచ్చటికివచ్చి యీపనిమీపవృక్షములలో దాగియున్నాఁడు.

సీత—(భయముతో) అమ్మయ్యో! ఏఁడి? ఏఁడి?

రావ—తొందరపడకు నామంత్రశక్తిచే నారావణుని నీయెదుట భస్మముచేసెదను. ఇటురమ్ము.

సీత—భాగ్యము స్వామీ! (లక్ష్మణునిగీటుదాటును.)

రావ—(తన) ఇప్పటికి గీటుదాటినది! (ప్రి) సీతా! నీవు రెండుకన్నులుమూసి రావణాగమనముం బ్రతీక్షించుచుండుము.

సీత—చిత్తము (కన్నులుమూసికొనును.)

రావ—(తన) ఇంక నాకీవేషమేల? నిజరూపముందాల్చి యీసీతం గొనిపోయెదఁగాక! (నిజరూపము దాల్చి) సీతా! కన్నులు తెరువుము.

సీత—(భయపడి) అమ్మయ్యో! పదితలలు ఇరువదిచేతులుగల వీడే రావణుఁడు రామా-రామా-రామా-(మూర్ఛిల్లును)

రావ—ఈమెనుఁగొనిపోవ నిదేసమయము. రంభాశాపముచే నిష్టములేని కాంతపంటితినేని మరణింతును. కావున నీమెను భూమితో పెల్లగించి రథమున నిడుకొనిపోయెదను.

(ఎత్తుచుండును.)

[తెర వ్రాలును]

పంచమదృశ్యము.

(రాముఁడు వనమార్గమున ప్రి॥)

రాము—

ఏమి ! ఆశ్చర్యము ! హేమకురంగి మై నన్ను భ్రమపెట్టిన యాదానవుండు, మరణించువేళ, "హాలక్ష్మణా ! హాసీతా !" యని కేకవైచెనేమి ?—ఇదియేదియో మాయవలెఁ దోఁచుచున్నది ! ఐనను లక్ష్మణుఁడు, ధనుష్పాణియై జానకినిఁ గాచియున్నంతవఱకు కేయపాయమునుఁ గలుగదు—

(లక్ష్మణుఁడు ప్రి॥)

లక్ష్మ—(ఆతురముగ) సోదరా ! సోదరా ! నిరపాయులుగ నుంటిరిగదా ? మహాప్రభూ !—

రాము—లక్ష్మణా ! ఏమిది ! పర్ణశాలలో జానకి నొంటరిగ విడిచి రావచ్చునే ! ఎంత తెలివిమాలిన పని జేసితివి ?

లక్ష్మ—మహాప్రభూ ! క్షమింపవలయును ! "హా! లక్ష్మణా ! సీతా !" యను నొక యాక్రందనధ్వని వినంబడ నది శ్రీరామకంఠస్వరము కాదనియు దానవమాయయనియు, నేనెంత చెప్పినను వినక జానకీదేవి నన్ను నిష్ఠురములాడి వినరానిపలుకులు పలికిన, చేయునది లేక, తమపాలికి వచ్చితిని.

రాము—అయ్యయ్యో ! మనము జానకి నొంటరిగ విడిచి, తిరుగఁదగిన ప్రదేశము కాదే యిది ! లక్ష్మణా! శీఘ్రముగ పర్ణశాల కరుగుదము రమ్ము—

లక్ష్మ—మహాప్రభూ! చిత్తము—(ఇద్దఱు నిష్క్రమింతురు)

(తెర లేవగ, శూన్యమగు పర్ణశాలకనఁబడును.

రాము—లక్ష్మణా ! ఏమిది ? చూడుము ! పర్ణశాల శూన్యమై కనఁబడుచున్నది !—

లక్ష్మ—మహాప్రభూ! ద్వారము తెరువబడియే యున్నది. పర్ణశాలలో వధూసికలేగు. సమీపవన తుపార్శ్వముల కరిగెనేమో—

రాము—ఏమి ? పర్ణశాలలో జానకి లేదా ! నాబహిఃప్రాణము లేదా ! నాజీవనాధారము లేదా ? నాబంగరుబొమ్మ లేదా ?—జానకీ—జానకీ—జానకీ—ఎందుఁబోయితివి ?

లక్ష్మ—అక్కా ! సీతమ్మతల్లీ ! ఎందుఁ బోయితివమ్మా మాయమ్మ !—ఎందుఁబోయితివమ్మా !!—

రాము—హా ! లక్ష్మణా ! సీతపలుకదు. సీతమాటాడదు. సీత ప్రత్యుత్తరమీయదు. సీతవదలెనా నన్ను? నాభాగ్యరాశివీడెనా నన్ను ? నాసంపూర్ణచంద్రబింబముచాటయ్యెనా నాకు ? నాజీవనజీవనము నమసినాశేమి ? హాసీత ! సీత !! సీత !!!

(మూర్ఛిల్లును.)

లక్ష్మ—అమ్మా జనకపుత్రీ! అమ్మా ! విమలగాత్రీ! మమ్ము నిర్భాగ్యులను జేసి యెందుఁ బోయితివి తల్లీ ! ఇది రాత్రిసమాయయని పలికిన వినక యెంత దెచ్చితివమ్మా !

రాము—లేచి)

సీ. ఓపూర్ణచంద్రాస్య ! యోసింహమధ్య, యో
హా! జానకీ ! యెట నుంటివోకద !
ఓకంజనిభనేత్రి ! యో హేమగాత్రి ! యో
హా ! జానకీ ! యెట నుంటివోకద !
ఓమంజులాలక ! యోశోభనాంగి యో
హా! జానకీ! యెట నుంటివోకద
ఓమోహనాకార ! యో గుణమహోదార ! యో
హా ! జానకీ ! యెట నుంటివోకద !

గృహమును, పురంబు, రాజ్యంబు నెల్ల విడచి,
రాజ్యలక్ష్మిని, మదనసామ్రాజ్యలక్ష్మి,
నీవుసైతము వీడ నింకేటిబ్రదుకు ?
సీత ! సీత ! సీతా ! సీత ! సీత ! సీత !!

(మూర్ఛిల్లును.)

లక్ష్మ—ఆహా ! రామచంద్రమూర్తి మూర్ఛిల్లినాఁడు ! ఎంత దారుణము జరిగినది ? ఎంత మహావిపత్తు సంభవించినది ? కట కటా ! దీనికంతకు నేనే కారణముఁగదా ? ఈయుపద్రవమ్మకే యేద్వవా ?—జానకీదేవి పోయినందులకే పొగులవా ? రామచంద్రమూర్తి దురవస్థకే దురపిల్లవా ?

రామ—లక్ష్మణా ! లక్ష్మణా ! జానకియేది ? జానకియేది ?

లక్ష్మ—మహాప్రభూ ! ఇంకెక్కడి జానకీదేవి ?

రాము—హా ! భూగర్భోద్భవా ! జానకీ ! నిజముగ లేవా? నా ప్రాణములలోని జీవనమగు నీవిఁక లేవా ! ఎందఱు మహారాజులు—ఎందఱెందఱు సార్వభౌములు నిన్నువరింపవచ్చినను శివధనుర్వ్యాజమున వారినందఱను సరకుసేయక, నన్నే వరియించి, నావెనువెంట మహారణ్యములకు వచ్చుటకు మహానందమునంది, తుదకు సముద్ధుండనగు నావలన ననుభవించిన సౌఖ్యమియ్యదియా ? పదుమూడేండ్లు వనములలో రాలనక, కొండలనక, ముండ్లనక, త్రిప్పి నిన్నలయించిన నాపాపంబునకుఁ బ్రతిఫలమాయిది ? సాధ్వీమణీ ! నాయపరాధంబున కేదియేని శిక్షావిధిని నిర్ణయింపక నన్నుఁ బాసిపోవ సంకల్పించితివా ! కల్ల—కల్ల—నీవట్లు నన్ను కలనైనఁ బాసిపోఁగలవా? ఈవనజంతుసంతానము లేమైన నిన్నుఁ దమపొట్టనుఁ బెట్టుకొనియుండును. అయ్యయ్యో ! ఒకరక్తపుచుక్కయైన నేలపైఁ బడకుండ నిను వనమృగము లెటు లాహరించె ?... కాదు. కాదు. ఏదియో భూతము

నిను మింగియుండవలయును ; కాదేని, యెవ్వఁడైన దుష్టరాక్షసుండు నిన్నాకాశమార్గమునఁ గొనిపోయియుండును ! —ఓగగనమా ! ఓభూదేవీ ! ఓమహీంగహాసభూరుహములారా ! మీరీన దేహముం దీర్పుఁడు. జానకి పోబడినెఱింగియున్న నాకు రవంత తెలియఁ జేయ రాదా ! మీకందఱకు నేనేమి యపకారము చేసితిని ! అదిగో ! జానకి పిలుచుచున్నది. లక్ష్మణా ! విను. విను. అది మీావధూనిక కంఠ స్వరము కాదా ! —కాదా ?—కోకిలయా ! హా ! హాతాకుఁడ— (విదానముగ చూచుచు) సీతా ! సీతా ! బహిఃప్రాణమా ! వచ్చితివా ఎంత భ్రమపడితిని !—ఎంత భ్రమపడితిని !—నీకంఠస్వరము నింతలో మరచితినా ! నాబుద్ధి పాడుగాను—కోకిలకూత లనుకొంటిని. నాతో పరిహాసములాడుచుంటివా !—ఆఁ !—ఆఁ !—ఆపొదలచాటున దాగకు హాహాహాహాహా ! సీత ! నాకు తెలిసిపోయినది! నీవు

తో దాగుడుమూతలాడుచున్నావు ! నన్ను వెఱ్ఱివానినిగాఁ జేయఁ జూచుచున్నావు ! కాని, నేను నివియోగమును భరింపలేను. నీకొఱకెంత దుఃఖపడితినో చెప్పలేను......అయ్యయ్యో ! సీతయేది ? లేదు. వచ్చి ఎచ్చి యెక్కడకుఁ బోయినది ? నాసీత నన్ను విడనాడి పోయినది —లక్ష్మణా ! ఇదియంతయు దానవమాయగాదు గదా ? దానవుడు-దానవుఁడా !—దానవమాయా పరిచ్ఛేదయ దివ్య బాణబాణాసనములివిగో—అరే దానవహతకా! లక్ష్మణా! ధనుస్సు! ధనుస్సు. దానవసంహారము. జానకీ—(మూర్ఛిల్లును)

## షష్ఠదృశ్యము.

(వ్రి రావణుడు—సీత.)

ఓపాపకర్ముఁడా ! దశగ్రీవా ! కులకళంకుఁడవగు నిజననమునకు, నిపితృదేవతులును, బ్రాహ్మణులును, సంతాపమందుచు, వేడికన్నీళ్లువిడుచుచున్నారు ! రంభశాపమునసైన నీకీదుర్బుద్ధి వదలినదిగాదే!

మిరా చెనటీ ! పతియే దైవమని నమ్ము సాధ్వీమతల్లుల నెందఱనో, చెఱబట్టి తెచ్చి పాపాకరమగు లంకాపురమునను౦చి, దుశ్చరితుండ వైనది చాలదే ! నీకింకను మానినీభోగతృష్ణ విడువలేదా ! దుర్మతీ ! బ్రహ్మ వంశోద్భవుండ వయ్యు రాక్షసకర్మావలంబనుండ వైనకతమున నీ మొగమున పిశాచములు తాండవించుచున్నవి ! పాపములు సదా నీపరిసరములం భ్రాంతులాడుచున్నవి ! నిన్ను వీక్షించిన దురితము! పాపము!

రావ—సీతా ! నిరర్థకమగు వాగ్వ్యయమువలన నేలాభమును లేదు ! పతిసం బాసినప్పుడే—నీ గతియుం బాసినది. నీ కిప్పుడీ రావణుండే గతి! ఇట్టి ప్రాకృతము నేల వదలుకొందువు? సముద్రముద్రితమగు లంకాద్వీపమునకు నరుండగు నీపతి యెట్లు కడచివచ్చి, నిన్ను విడిపించువాఁడా ? ఎంత వెఱ్ఱిభ్రాంతిని వహించుచుంటివి ? తెలివితక్కువ కేకలు వేయక నడువుము. నడువుము.

సీత—ఛీ—ఛీ—తులువా! నీవు నాకు గతియగుదువటరా ? జగదానంద సాంద్రుండగు శ్రీరామచంద్రుండుండ నిఖిలదనుజగర్వాపహర్తయగు శ్రీరామమూర్తియుండ—

రావ " ఉండ—" యనుమాట యేమి ? దశగ్రీవుండు నిజము గాదలచినచో నాతఁడు లేకపోవుటొక లిప్తమాత్రము కాదే ? మగవాఁడయ్యు పరశురామునకోడి గాజులుదొడిగించుకొనిన యాడుదియగు తండ్రి బ్రతికియుండఁగనే యాడుదానిమాటలమున రాజ్యమునుండి గెంటింపఁబడి యడవులలో చెట్టుపుట్టయనక దిరుగుచు నాకలములుదిను పశుసమానుండగు రాముండా ! నిర్జితానేకనిర్జరలోకభీషణుండగు రావణుని గెలుచుట. రాముని నీ కరవాలమున కెర గావించెద. నిన్ను గామించెద నాకరపంజరంబున. నిన్ను గౌఁగిలించెద. సకలమానవవైభవములు సమర్పించెద. నిన్ను మన్మథక్రీడల దేలించెద.

సీత—ఛీ! దుర్మతీ! దూరముగా నుండుము; దరియ రాకుము. రామదూషణ మొనరించిన నీనాలుక వేయిచీలికలగునురా పాపాత్మా! సాధ్వులఁబట్టి తెచ్చిన నీకు చావు శీఘ్రముగ రాక యుండునా? రాక్షస లోకభయంకరమూర్తియగు- శ్రీరామచంద్రమూర్తి, తనతీవ్ర నారాచ పరంపరలచే నీపదితలలు నిరువదిచేతులు ధూళిలోఁ దొరలాడునట్లు సంహరింపకుండునా! నీ నెలతలు గాజులు పెళపెళబ్రద్దలుగొట్టుకొని మంగళసూత్రములను పుటపుటపుటపుట దెంపుకొని తలలువిరియబోసుకొని నదీతీరములకు బరువెత్తకుందురా? పుత్రులు యజ్ఞోపవీతముల నపసవ్యములుగ వైచుకొని నిప్పుకుండలతో శ్మశానముల కేగకుందురా! నీ శ్మశానమునందలి కాష్ఠములమీఁది పొగ యవ్యాహతముగ విచ్ఛిన్నముగ నాకాశమున కెగయ పాపాత్ముఁడగు రావణుఁడు చచ్చెనని దేవతలానందముతో పుష్పవర్షముం గురియకుందురా పాపీ! నరకమున ఘోర వాఁదిబాధల నందునప్పుడైన పూర్వజ్ఞానము గల్గి యుఁగోమని యేడ్వకుందువా?

రావ—ఆ-చండాలినీ! ఏమంటివి-నామరణము నేసంకల్పించితివా? నాచావుమాటల నాడుచుంటివా-నేను చావవలసియే వచ్చినచో నిన్ను బిగ్గ కౌఁగిలించి నీమానభంగము జేసియే చచ్చెదను నిలువుము నిలువుము

[కౌఁగిలింపఁబోవును]

సీత—ఓరి క్రూరకర్మా! కులద్రోహీ! మానినీమానభంగమహాపాతకవర్తీ! దుర్మార్గచక్రవర్తీ! నేను నీలంకావినాశనమునకును నీమరణమునకును సకలరాక్షససంహారమునకును భూగర్భమున జన్మించిన యాదిమహాశక్తిని. రావణవినాశనకాలకాళికామూర్తినగు నేనాపై దూసిన నీకత్తి కుటాకుంచలగుఁగాక! నన్ను కౌఁగిలింపఁదలఁచిన నీకరము లిరువదియు నన్నంటినయుత్తరక్షణముననే నీశిరములు సహస్రభిన్నము

లై తూలికాలి నశించెదవుగాక. పాపాత్మా! నన్నులంకాపురమునకు గొని పోవుట మృత్యుదేవతను వెంటనిడుకొనిపోవుటని నమ్ముము. లంకాపురమునకే జేరిన, నీరాక్షసులకు నాయొక్క స్వరూపమే కోటిపిశాచ రూపములనుధరించి రాక్షసుల వెంటసంచరించి సంహారించునుగాక. దురాత్మా! ఆదిశక్తియగు సీతకో సహంకారములాడిన నీకిప్పుడే శాపమీయగలిగియు శ్రీరామమూర్తిచేతులలో నీమరణము లిఖింపబడియుండుట వలన మిన్నకుండవలసినదాననైతినిరా దురాత్మా!—

రావ—ఆ! పాపినీ—కోపినీ! ఊరకున్నకొలదియు గారులాడెదవే! నిన్నిప్పుడే పరిమార్చెదను

[కత్తిదూయును]

సీత—హా ప్రాణేశ్వరా! రక్షింపుము! నన్నుగావ నిది గదా సమయము!

[జటాయువు ప్రవేశం]

జటా—రే లోకకంటకా! జగన్మాతయగుసీతాదేవి జీవనము నందలి పశుపక్షి క్రిమికీటకాదులును, చేతనాచేతనాది సమస్తపదార్థములును రక్షణములని యెఱుంగవే. దుర్మతి! ఈజటాయువుబారి నుండి తప్పించుకొని సీతనై ప్రయత్నింపుము.

రావ— (రెక్క విరుగ గొట్టును)

సీత—భక్తాగ్రేసరా! జటాయూ! రామదాసుడవగునీకు రామదర్శనముగుదనుక మృతిగలుగకుండు గాక! (తెరవ్రాలును)

సప్తమ దృశ్యము—రామలక్ష్మణులు ప్ర.

లక్ష్మ—మహాత్మా! మీయీదుఃఖమున కంతకును కారణము నేన మైతిసుడీ!

రాము—తమ్ముఁడా ! ఒకరోజు గాదు—రెండురోజులుగాదు పదునాలు గేండ్లు నిద్రాహారములను బరిత్యజించి, మాపరిచర్య చేయుచుంటివే ! ఇప్పుడిట్లనుకొననేల?

లక్ష్మ—వైదేహిమాటలు విని యామెను విడిచి రాముఁడిన యెడల నింత కర్మము మానుగదుగదా !

రాము—అట్టిసంశయమునుని మనస్సునను౦చుకొన్న నాయందే సుమా తమ్ముఁడా ! ఏలనన,

సీ. దుష్టయామాంధర ƒ దుర్బోధనలువిన్న
తల్లిగా దెగడనే ƒ తల్లిగారి
మాటలాలించిన ƒ మాతండ్రినందునే ?
సుమశరు నుడి విన్న ƒ శూర్పణఖను
దిట్టుదునే? దాని ƒ తెగువమాటలువిన్న
రావణునందునే ƒ లంకనేఁదు?
మాటలు చెవినిడ్డ ƒ మారీచు నందునె
వానిమాటలువిన్న ƒ వనిత నననె?

గీ. వనితమాటలువినియామె ƒ వసని విడచి
నట్టినిన్నింకఁదిట్టనే ƒ తుట్టతుదకు
పాపవిధి పరిణత కేడ్వ ƒ వలయుఁగాని
యొకరినాడిన దురితమే ƒ యొండులేదు.

లక్ష్మ—అన్నయ్యా ! ఈరామాయణమంతయు నిటులే యున్నది. మీకథవలన నాడువారిమాటలను వినరాదనునీతి నేర్చుకొనవలయు నేమో తెలియకున్నది

రాము—తమ్ముఁడా ! అటులందు వేమి ?

లక్ష్మ—సోదరా ! మరియెట్లులనవలయును ?—మంథరమాటలు కైక వినెను. కైకమాటలు తండ్రిగారు వినిరి; శూర్పణఖమాట

లు రావణుఁడు వినెను; వధూనిక మాటలు నేను వింటిని; ఆడువారిమా టలువిన్న ఫలిత మేకాదా తమకనుభవించునది ;

రాము—అయ్యో ; వెఱ్ఱితమ్ముఁడా ; లోకమునందలి యాఁడు వారందఱు నట్లేయుందురా ; మీవదిన జానకవంటి ప్రాణికీ స్త్రీపురుషా దులలో దొరకునా? హా ; సీతా ! హా ! సీతా;

ఆ పిల్లనోట చిల్క పిట్టవిధంబున
వ్యాఘ్రనఖములంగుమారి ణమువలె
కోఁతి చేతఁబడు ప్రసూనమాలవిధంబు
నారి ; యేదురాత్ముచేఁబడెనో

మఱియు—

ఆ. సరస నేను సల్వ సౌమిత్రి యావల
నిలువ దనుజ పైన బడగరాఁగ
కాంత యంచు నన్ను గాఁగిలించిన గోల
వెటుల దనుజుఁగోడ నేగినావో ?

లక్ష్మ—మహాపురుషా ; ఆశ్వాసిల్లవలయును.

రాము—హా ; జానకీ ; జానకీ !

(ధ్వని తెరలో)

హా! జా కీ దేవీ—జానకీదేవీ ;

రాము—(ఆశ్చర్యమున) జానకీ ; జానకీ ;

[ధ్వని]

హా ; జానకీదేవీ ; జానకీదేవీ ;

రాము—తమ్ముఁడా ; ధనుస్సు ; ధనుస్సు ;

లక్ష్మ—అన్నా ; ఎందులకు?

రాము—లక్ష్మణా ; సీతా యని మారీచుఁడు మిమ్ము భ్రమ పెట్టినట్లే—మరల నెవ్వఁడో రక్కసుఁడు నేను జానకీ యని దుఃఖించు

చుండ తిరిగి వెక్కిరించుచున్నాఁడు; వానికి ప్రాయశ్చిత్తము కావలయును;

లక్ష్మ—సోదరా ; ప్రతిధ్వనియైయుండును.

రాము—ప్రతిధ్వనియైనచో "జానకీ" యన్న—"జానకీ" యనవలయునుగాని, "జానకీ" యన్న జానకీదేవీ యను టేల ?

లక్ష్మ—అట్లయిన నది వెక్కిరించుటమాత్ర మెట్లగును?—జానకీదేవి యని గౌరవగర్భితముగ గనఁబడుట లేదా ?

రాము—అట్లయిన నెవరందువు ?

లక్ష్మ — వెదకుదము.

(ఇద్దఱు వెదకుదురు)

[జటాయువు పడి యుండును]

జటా—హా ; జానకీదేవీ; నీవరకున నా ప్రాణములు నిలచెను. కాని, శ్రీరామమూర్తిదర్శనము లేకున్నదిగదా;—రామా —రామా రామా—

రాము—తమ్ముఁడా ! వింటివా ; ఓ యార్యుఁడా ; నిర్భాగ్యుఁడగు రాముఁడను నేనే ;

జటా—రామచంద్రా ; రామచంద్రా ; —నమస్కారము. నాకన్నులపండువయ్యె జననము సార్థకమయ్యె;

రాము—ఓ పక్షిరాజమా ; నీ వెవ్వఁడవు? ఇట్లేల పడి యుంటివి?

జటా—రామప్రభూ ; నేను జటాయువనువాఁడను తమపాద దాసుఁడను; లంకాధిపతియగు దురాత్ముఁడు రావణనామకుఁడు పూజ్యురాలగు జానకీదేవిని గొనిపోవుచుండఁగా వారింపఁబోయి పోరాడితిని—ఆదురాత్ముఁడు నా ఱెక్కలువిఱుగగొట్టిన ప్రాణావశిష్టుండనై దేవీవరలాభము

వ మీాకీవార్తనెఱిగించుటకు బ్రిదికియుంటిని. ఇఁక నా జీవితములు నిలువవు. —నాకు విష్ణులోకప్రాప్తిగలుగునట్లు మీాచే దహనము గావించి నావంశమునకు రామబంధునామము ననుగ్రహింపుఁడు.

రాము — రామబంధూ! పూజ్యుఁడవై — నా సతీమణికొఱకు పోరాడి రామకార్యమున జీవములు విడుచుచు, పుణ్యాత్ముఁడవైతివి; నీఋణ మీావిధముగఁ దీర్చుకొందును.

లక్ష్మ. — ఈయన చేతిసంస్కారమును కన్నతండ్రియైన నోచలేదు. నీవు పూజ్యుఁడవు కావుననే నిన్ను శ్రీరామచంద్రమూర్తి స్వయముగ దహనపరచుచున్నాఁడు; నీకు పుణ్యగతులు కలుగును.

జటా — రామసౌమిత్రులారా! ధన్యుఁడను ధన్యుఁడను నాజీవితములు పోవుచున్నవి — రామా రామా రామా (ప్రాణములువిడుచును.)





శ్రీ

# సుగ్రీవపట్టాభిషేకము.

---

## చతుర్థాంకము

---

### ప్రథమరంగము.

సుగ్రీవజాంబవంతులు ప్రవేశము

సుగ్రీ——తాతా! జాంబవంతా! మసకమసకగానున్న దిక్కులును తెల్లవారినవి. రాత్రియెల్ల చేసిన ప్రజాగరణముచేత కన్నులును, రాత్రికడచినప్పుడనే రాబోవుమరణభయముచేత మనస్సును, ఒకేవిధముగా మండుచున్నవి. ప్రాగ్దిశాతలమును, చక్కగాజూడుము! బారెడుపై కెగసిన వేగుచుక్కకు క్రిందుగాన్పించు నా వెలిమబ్బుచాయ,

సీ. ప్రాగ్దిశాంగన శిరోభాగంబు నందిడ్డ
పసమించుపట్టు మేల్ముసుకనంగ
దినరాజశైలూష దివ్యాగమమునకై
సురనాటకుఁడుగూర్చు తెరయనంగ
కమలారిభర్గతి గాంచి యనూరుండు
నవ్వినరదన విన్నాణమనఁగ
ఉదయోన్ముఖార్క మహోదాద్రిమకుటస్థ
కమనీయనవరత్న కాంతి యనఁగ

గీ. హారిజగన్మిత్ర, సందర్శ ॥ నాభిలాష
దివిజులిడనున్న కుంద సం ॥ దీప్తియనగ
నెల్లయెడ పూర్వదిశయందు ॥ వెల్ల బారె
తెలివిచేకూరె లోక ఋ ॥ తెల్లవారె.

జాంబ—అవును నీవింక శీఘ్రముగ ఋష్యమూకపర్వతము చేరవలయును.

సుగ్రీ—తాతా! మతంగమహర్షి యనుగ్రహముచే వాలికిని వానియనుచరులకును గల్గిన శాపమువలన నీపర్వతమునకు, వారు రాజాలకుండుటచేత నాకింతమాత్రమైన నిలువనీడదొరికినదిగాని లేనిచో నాయన్న వాలి నన్నిదివరకే హతమార్చియుండును.

జాంబ—ఇక నీకా భయములేదు. కాని వానినిన్నటిప్రతిన దారుణముగానున్నది.

సుగ్రీ—పితామహా! అవును. వాడు నన్ను వధింతునని గడువు పెట్టినది నేడేకదా? నేడెట్లు గడచునోయని నామది తల్లడిల్లుచున్నది.

ఉ. చిన్నతనంబుగా ననిది ॥ పేర్కొనగూడనిదంచునెంచకే
చిన్నదొసంగు పెద్దదిగ ॥ జేసియు నిల్వెడలించె వాలి నా
యన్న యనాధనైయిసుభ ॥ యంబున జేరితి ఋష్యమూకమున్
కన్నులు లేవె యీతనకు ॥ కల్గనగావగరాదె దీనునిన్.

(తెరలో)

రాకేమి? వచ్చుచున్నాను. అన్నయ్యా! వచ్చుచున్నాము?

జాంబ—శుభపరిణామము. శుభపరిణామము. సుగ్రీవరాజేంద్రా! నీకష్టములుకడముట్టినవి. నీయన్నయగు వాలినిజంపి సమస్తవానరసేనల కధినాథుడవై కిష్కింధాపురమున పట్టభద్రుండవు కాగలవు.

సుగ్రీవు—తాతా! ఆధ్వనియెక్కడిది. అది శాఖామృగకంఠస్వరము కాదే.

జాంబ— కాదు. సుక్షత్రియకుమారుల కంఠము. ఆముంగిట నున్న మఱ్ఱిచెట్టున కావల సూటిగా బరికింపుము.

సుగ్రీ—హా! చచ్చితి-చచ్చితి.

జాంబ—సుగ్రీవా! నిదానింపుము. భయము లేదు.

సుగ్రీవు—తాతా. ఇంకేమి నిదానింపవలయును.

సీ. వీరుల కెదలోన వెరపు బుట్టించెడు
గంభీరమగు ముఖ కాంతివారు
చెలువుగా గట్టిన శిఖిపింఛములలోన
వెలిమల్లెదండలు వెలయువారు
మోకాలిపైనున్న ముదుగువంచెలపైన
ధట్టీలు బిగియించి కట్టువారు
ఎకుభుజంబులనుండి జల దాకువరకును
వ్రేలుతూణంబుల వెలయువారు

గీ. వట్టుదల మోమునందు గన్పట్టువారు
విమలనీలాభ్రకనక వర్ణములవారు
బలముగలవారు క్షత్రియుల్, పడుచువారు
వాలిపంపున నను జంప వచ్చినారు.

జాంబ—సుగ్రీవా! ఊరకే భీతినందనేల? వారు వాలిపంపున నేల వచ్చెదరు. చంపదలచినవాడేని వాలియే నిన్ను చంపునుగాని, ప్రతాపశాలియగు వాలికి వారు వీరిలోడేమి? నిదానముగ నాలోచించి పనిచేయుము. నాబుద్ధిపరికించిచూడ వీరికి వాలితో నేమాత్రము సంబంధమున్నట్లు తోచుటలేదు. అదిగాక తిన్నగా పరిశీలింపుము. వారేదో విచారమున మునిగియున్నట్లున్ను పెద్దయాతని చిన్నయాతను సమాశ్వాసించుచున్నట్లును కనబడుట లేదా? కావున, మహాబుద్ధి-

మంతుఁడగు హనుమంతుని వారికడకంపి వృత్తాంతమరయుము. ఒకవేళ వారు నీకు సాయపడినను సాయపడవచ్చును.

సుగ్రీ—మహాభాగ్యము.

జాంబ—నేనంక వాలికడకరుగకతప్పదు. నేను నీకడ కరుదెంచుట వినినేని రవులకపోదు; సమస్తారణ్యముల నెఱింగిన పితామహుఁడను గావున, నిన్నింతవఱకు కాపాడితిని; పోయివచ్చెద.

సుగ్రీ—ఉత్తమము. దీనునిపై ననుగ్రహము మాత్రముంపుడు.

జాంబ—అట్లే కానిమ్ము. నీకు పరమేశ్వరుఁడు తోడగును! పోయివత్తును.

(నిష్క్రమించును.)

సుగ్రీ—ఆహా! ఈజాంబవంతుఁడు తిరిగి నాకింతమున జీవనాశామృతముఁబోసి చనినాఁడుగదా? ఆఁ ఏమిచిత్రప్రపంచము.

గీ. చావుప్రతినిమేషము తను ॥ ఛాయరీతి
వెంటనుండుట నెఱిఁగియు ॥ వేలయేండ్లు
బ్రదుకుదునటంచు నరుఁడు వి ॥ భ్రాంతినంది
భువికిదివికెల్లప్పుడు ॥ మాఁడిపెట్టుచుండు.

(నిష్క్రమించును.)

ద్వితీయరంగము.

రామలక్ష్మణులు ప్రవేశము

రామ—చిరంజీవ!

లక్ష్మ—మహాప్రభూ! వచ్చుచున్నాను.

రాము—మహాప్రభూ' అని పిలిచెద వేమి బాలకు?

గీ. ప్రభురమాదేవియున్నెడ తా ॥ వదలనన్ను
తనుమహాలక్ష్మియైనట్టి ॥ ధర్మపత్ని

యిట్టులైడఁగాసె నింక నా । కెట్టిప్రభుత
బ్రదికియుంటిని భువిని భా । రంబుగాఁగ.

సరి కాని లక్ష్మణా! మనము శూర్పనఖకు ముక్కుచెవులుగోసి యెన్ని నాళ్లయినది.

లక్ష్మ—పది దినములు కావచ్చునది మహాప్రభూ!

రాము—ఆఁ ఒకరికిచేయునుపకారము సద్యోఫలితము సేయకున్నను నపకారముమాత్రము తప్పక ఫలించుననుమాట నిత్యము.

గీ. చెనఁటిశూర్పనఖకు ముక్కు । చెవులుఁగోసి
నారమే కాని యాతండు । నాఁడుగాత్రి
మర్థముఁగఁగోసికొనిచనె । నకట! యొకరి
యపకృతి తనకు ద్విగుణమై । యంటునయ్య!

లక్ష్మ—సోదరా! వాల్గుదినములనుండియు మీరొకవిధమగు ధోరణిలో నున్నారు. జటాయువు రావణవృత్తాంతము వచి చెనుగదా! ఇఁక కర్తవ్య మాలోచింపఁ దగదా?

రా—కర్తవ్యమా! ఓవెట్టివాఁడా! కర్తవ్యము మాట యటుంచుము. నాకుఁ దొలుత జానకి మఱపున కేట్లువచ్చునోయి? చూఁడ — సీతకొఱకీ ప్రకృతియంతయు నెటులేడ్చుచున్నదో?

గీ. కలసియాటలాడిన మమ । కారమునను
హరిణశాబములేడ్చు । "నమ్మా?" యటంచు
క్రూరశార్దూలముఖ మృగ । కోటిగూడ
దారిఁజూపెను నదె నేత్ర । వారిగురిసి
మాన్యుఁడగు ద్విజరాజభి । మాన పటిమ
ననువులే మకయి విడ । నాడెనయ్య
ప్రకృతియంత నిశ్చైతునం । భవకటాక్ష

మిటుల మనయెడఁజాపము కే హీనుమాఁరి
యనుక్షణంబును నాస్మృతికే యుఁగదునిలువ
నామనమున కర్తవ్యంబు కే నాటు నెటులు?

లక్ష్మణా!—లక్ష్మణా!— ఏమి చిత్రము? సీతాస్మృతిచే నాకన్ను లదరుచున్నవి. గాత్రముకంపించుచున్నది. హా! సీతా! సీతా! సీతా! (కన్నులు మూయును.)

లక్ష్మ—మహాత్మా! శ్రీరామచంద్ర!

రా—పిలిచితివా?

లక్ష్మ—అటులేలకన్నులు మూసితిరి?

రా—ఏమి?

ల—మీకు బాధగనున్నదా?

రా—బాధ లేదు—కాని,—

ల—కాని యేమి స్వామీ!

రా—అటు చూఁడుము! అది యేమి?

ల—ఏది?

రా—ఆనీలజీమూతముల మధ్యమున క్షణమున కొకసారి కనఁబడునది.

ల—విద్యుల్లత కాఁబోలును—

రా—కాదు—అది—లక్ష్మణా!—విద్యుల్లత కాదు. అది జానకి—నాజానకి—తీసికొని వత్తము వచ్చెదవా!—కాదు—నేనే వెళ్లెదను—సీతా! సీతా! ! —రా—నాహృదయసామ్రాజ్యపట్టమహిషీ! రా—అయ్యో! —అదేమి? అదేమి? —హా! సీతా! —సీతా! సీతా! క్షణకాలములో నెక్కడకుఁబోయితివి? వచ్చుచుంటిని. ఇదిగో— నీకొఱకే వచ్చుచుంటిని—(పరుగెత్తును.)

ల—(పట్టుకొని) స్వామీ! అక్కడ నేమిచూచెదరు. అది వట్టి మేఘమాల—

రా—మేఘమాల కాదోయి! లక్ష్మణా! దానిలోపల నున్న దానిమాట—

ల—లోపల నేమున్నది—జలము—

రా—దాని పైన?—

ల—ఆకాశమే—

రా—అలాగా? సరే లక్ష్మణా! అది విఱిగి మనపైఁ బడను గదా!

ల—పదార్థరహితమై నిరాధారమగు నాకాశముగదా! మనపై నెట్లు పడును?

రా—హా! హా! ఆకాశముగూడ మనవలె నిరాధారమా?

గీ. అంబరము! నిరాధారుల కైమెసమనము,
నీవువిద్యుల్లతను, నేను కెనెలతసీతఁ
గోల్పడితిమింక నొకచోటఁ కి గూరుచుండి
యూరడించు కొందము మనకి మొకరి నొకరు.

ల—మీ యాత్మ వికలతనొందినది!

రా—నేనాత్మసన్యాసినైతిని గాదా! నాకు వికలతయేమి? (స్మృతినభినయించి) ఆ! లక్ష్మణా! అన్నట్లు నాధనుస్సు—నాధనుస్సు.

ల—మహాత్మా! ఎందులకు?

రా—కపటసన్యాసియై వచ్చిన యాకలుషాత్ముని శరీరమును రెండుతునకలు చేయుటకు.

ల—వాఁడిప్పుడెక్కడనున్నాఁడు?

రా—లేఁడా? చూచుము. వానిని రప్పించెదను. మనోబలము చే రప్పించెదను. సీతా-సీతా-సీతా!

(కన్నులుమూసి పరుండును.)

ల—(రాముని తొడపైనుంచుకొని) హా! హా! కాలవికృతి?

గీ. పినరుఁబట్టాభిషేక ము । హూర్తమేమి
యానమయమందె యారణ్య । వాసమేమి
వేడుకకుఁదెచ్చియిమ్మన్న । లేడియేమి
ఘోరదనుజాధముండయి । మారుటేమి
కఠినభావలనెఱుఁగని । కాంతయేమి
వంచనముసల్పి నన్ను దూ । షించుటేమి
హానిసేయఁగదగని స । న్యాసియేమి
భూసుతనుదైత్యుఁడై కొని । పోవుటేమి
జ్ఞానచిద్రూపుఁడగు రామ । చంద్రుఁడేమి
యతివరైయిటు లున్మాదుఁ । డగుటయేమి
క్షితిఁబ్రకృతినిత్యచిత్రవి । కృతులఁగాంచు
దాటలేడుగా విధిని వి । ధాతయైన.

(దూరమునఁజూచి) ఆఁ! ఏదియో పెద్దకోఁతి యీవంకకు వచ్చుచున్నది. రావణునిమాయచే నెవ్వఁడైన రాక్షసు డిట్లువచ్చుచుండడుగదా! అన్నగారు నిద్రించుచున్నారు—నిద్రాభంగముగాకుండ వీనిని నే వధింతు.

(బాణములు సవరించును,)

హను—(సన్యాసివేషముతోఁ బ్రవే॥) మహాత్మా! రక్షింపుము. రక్షింపుము. (పాదములఁబడును)

ల—ఓవృద్ధమర్కటమా! రక్షింపుమనియరచితివిగాన, రక్షించితిని. నీవు చూచుటకు కడువేడుకగానున్నావు. మచ్చికపడిన పెంపుడుకోఁతివిగాని అడవికోఁతివి గావు.

హను— సీ. ఎవరయాచక్కని । యువనీపతులుమీరు
లక్ష్మ— అర్కవంశజయో । ధ్యాపురంబు

హను — మీ పేరు లేమయా? ¦ యో పుణ్యజనులార!
లక్ష్మ — ఘనరాముఁ డతఁడు ల ¦ క్ష్మణుఁడ నేను
హను — ఏ కార్యమునకిట్టు ¦ లే తెంచితిరి మీరు
లక్ష్మ — పితృవాక్యమునకయి ¦ వెడలివచ్చి
శ్రీరాముసతియైన ¦ సీతను దశకంఠుఁ
డపహరింపఁగ నుంటి ¦ మయ్య యిచట
హను — గీ కటకటా! యెట్టికష్టంబు ¦ గలిగె మీకు
లక్ష్మ — వింతయయ్యెను నీగు వృ ¦ త్తాంత మేమి
హను — భానుపుత్రుఁడౌ సుగ్రీవు ¦ బంట నేను
అనిలపుత్రుండ హనుమానుఁ ¦ డనెడువాఁడ.

రాము — (లేచి) లక్ష్మణా! ధనుస్సు ధనుస్సు.

లక్ష్మ — సోదరా! శాంతింపుఁడు. ఈతఁడు మనశత్రుఁడుగాఁడు. ఈవనమునందిరుగు నొక శాఖామృగము. ఇంతసేపటినుండియు వేడుకగా మాటలాడుచున్నాఁడు. సూర్యపుత్రుఁడగు సుగ్రీవునకుబంటఁట! అనిలపుత్రుఁడగు హనుమంతుఁడఁట.

రాము — కపివరా! సూర్యపుత్రుఁడు సుగ్రీవుఁ డిచ్చటకు నిన్నేలనంపెను?

హను —

గీ. అన్న చేహతరాష్ట్రుఁడై ¦ యనుభయమున
ఋష్యమూకపర్వతమందు ¦ దిరుగుచిపుడు
మిమునిచటఁగాంచి రిపులగా ¦ భ్రమవహించి
వాస్తవం బారయఁగ నన్ను ¦ బంపెనయ్య.

రాము — నేనును హతరాజ్యుఁడనే? ఆతఁడును హతరాజ్యుఁడే? లక్ష్మణా! మనమాతని నేల చూడఁగూడదు?

హను — (సంజ్ఞచేసి సుగ్రీవుని పిలుచును.)

సుగ్రీ—పాహిమాం పాహిమాం శ్రీరామచంద్రా (పాదముల బడును.)

రాము—లెమ్ము. సుగ్రీవా! లెమ్ము. దిక్కులేనిమాకీ మహారణ్యమున దిక్కులేని నిన్నొకదిక్కుగా విధిచూపెను. నీకు నేనుదిక్కు నాకు నీవు దిక్కు. నాకంఠమున జీవములున్నంతవఱకు నీకేభయమును లేదు. లెమ్ము.

సుగ్రీవు—రామచంద్రప్రభూ! నాసోదరుడగువాలి నారాష్ట్రమును, భార్యను నపహరించినవృత్తాంతమును ఋష్యమూకమున కరిగి చెప్పుకొందము రండు. మాకీ నడుమ నొకనగలమూట దొరకినది. అదియొకవేళ సీతామహాదేవిది కాకూడదా?

రాము—అట్లయిన ఋష్యమూకమునకే పోదము.

(అందరు నిష్క్రమింతురు.)

వాలి అంతఃపురము

ప్రా॥ వాలి—రుమ.—

వాలి—ఒక్కసారి మా త్రిమిమ్ము-ఒక్కసారి.

రుమ—రాజా! వలదు. నేను చెప్పినమాట వినుము.

వాలి—ఇంక నొకమారుకన్న నెక్కువత్రాగను. నీచేతిలో పాత్రి నిటు తెమ్ము.

రుమ—ఇదివరకనేకమాఱ్లు త్రాగితివి. ఒడలెఱుంగకుండ మాటలాడుచుంటివి; చాలును. అతిపానము పాయకరము సుమా?

వాలి—దాహ మధికముగా నున్నది. యీ సారు కడుపునిండ త్రాగి యిక నెన్నడు త్రాగుడు జోలికిపోనని యొట్టుపెట్టుకొందును

రుమ—ఈసారి త్రాగుట మానివేయుదువుగద?

వాలి—ఆఁ నిశ్చయముగ.

రుమ—అట్టి మనోదార్ఢ్యము నీకుగలదా?

వాలి—సందేహమేమి;

రుమ—అంతమహోద్రేకమగలవాఁడ వీక్షణము నుండియే యీ తాగుడు మానివేయరాదా?

వాలి—ఈనిముసమునుండియు నా? ఛీ! ఛీ! తిరిగి యామాట యేనా! ఇప్పుడు నా కమితదాహముగుచున్నదని చెప్పలేదా? ఇప్పుడు తాగియాయుత్తరక్షణమునుండిమానుదును.

రుమ—ఇప్పటినుండి నీవు మాఁదిగిమలేనివాని కింకొకక్షణ మునుండి మాత్రమెక్కడనుండివచ్చును?

వాలి—ఇప్పుడు నాకు దాహముగానున్నదని చెప్పలేదా?

రుమ—దాహమునకు వేరుపానీయములు లేవా?

వాలి—వేరు పానీయములు నాదాహముఁ దీర్పలేవు. మధు రసమోనీయధరరసమో కోరులనిమ్ము.

రుమ—(పాత్రమునటుంచి వేసి) రాజా! నీకిదితగదు. నాపతి జీవించియుండగనే నీవు నన్ను కోరతగదు.

వాలి—నీపతి జీవించి యున్న నేమి?రుమా! నేను నీకు తగనా? మారునివిరాళి సైపజాలనో బాలా! రతికేళికిరమ్ము.

(తార ప్రవేశము)

తార—ఓసీనుష్టురాలా! ఎవ్వతెవే నీవు? నాపతితో సరస ములాడఁగడంగితివి?

రుమ—ఓసీసిగ్గుమాలినరాలా!నీపతికొఱకు భ్రాంతిపడితో తెత్తె వ్వతె? ఇన్నినాళ్లును నాపతితో కులికితివి చాలదా?

తార—పొగరు పట్టిన మాటలాడఁబోకు; తొలుత నా నాథుని సరసనుండి లేచిపో;

వాలి—ప్రాణేశ్వరీ! తారా! నీచెల్లెలురుమతప్పేమియును లేదు. దానిని క్షమింపుము;

తార—అవును! నిన్ను సుఖమింపవలసినదే. ఇద్దఱు నిచ్చట యథేచ్ఛముగా త్రాగి తందనములాడుచుండిరా? ఆహా! ఎంతసాహసము! ఎంత తెంపరితనము! తారయేమయ్యె ననుకొంటివి? ఈతొత్తుకూతురే నీకేడ్గడయని నమ్మితివా? ప్రక్కఁగొని బానసతనమున కమరలేదని యేడ్చుచుంటివా? దాని పాదములపైఁ బడుచుంటివా?

రుమ—ఓసీగయ్యాళీ! నీయైశ్వర్యము చూచి నీమగనిరూపము చూచి వలచి నీకుసవతియగుట కెవ్వతెయు రాలేదు; నోరుకట్టి పెట్టుకొనుము

తార—సిగ్గుమాలినదానా! నీయేకాంతము నే చూడలేదటే! మధుపానపాత్రి దగ్గఱజేర్చి పట్టి నాభర్తను త్రాగించి యొడలు తెలియకుండనున్నప్పుడు పైబడవలయుననుకొంటివా!

వాలి—తారా! దీనితప్పులేదు. నేనే మితిలేక బుద్ధిగడ్డితిని—

తార—చాలును లే! నీబుద్ధి బుగ్గియైనట్లున్నది. అయినను ఇది బుద్ధిమంతురాలనినమ్మితివా?

రుమ—అబ్బ! ఎంత బుద్ధిమంతురాలు బయలుదేరినది? ఎంత మానవతి యవతరించినది! ఎంత పతివ్రత మూర్తీభవించినది! మగడు-యీమగడు-దుందుభిచేతకడతేరినాడను శంక లోకులకుఁజెప్పి నమ్మించి నామగనిసౌందర్యము జూచి భ్రమించి యాతని నగ్నిసాక్షిగ గట్టుకొనినదాననంటినని రుయిన భయములేక లజ్జలేక, నెన్నినాళ్లు నాకు సవతివైతివే! నీసవతి మత్సరము చట్టబాడలుగాను నామగని యందము యందమడుగనా?

తార—ఆఁ! మిట్టకన్నులు, బండ మొగము పందిబలుపు, నీమగని యాకారమునకు మోహించియే యిన్నాళ్లు తలక్రిందులయితిని! ఛీ! అభిమానపడి చావక యింకను తగుదునని ప్రగల్భములను గొట్టుచుంటివా?

వాలి—మీకిదేమి యాగడము। తారారుమలారా! నామాట నుంతైన వినరుగా?

తార—భార్యను వదలి పరస్త్రీని మరిగినవానిమాట నెవ్వరు పాటింతురు?

రుమ—కల్లుద్రాగినకోతిమాటలు గణనీయములగునా?

వాలి—తారా! నీకు వందనము. రుమా! జోహారు. మీకలహములు మానివేయవలయును.

(జాంబవంతుడు ప్రవేశము)

జాంబ—శివశివా! బాబుగారు దక్షిణామూర్తులయినారే!

వాలి—ముద్దుగుమ్మలారా! తాతగారు జాంబవంతులు వచ్చిరి. మీకలహవిషయము తరువాత చూతము. లోపలకరుగుడు.

రుమ—(నిష్క్రమించును)

జాంబ—వానర రాజేంద్రా! నీతోడ విశేషాంశములు ప్రస్తావింపవలయును రమ్ము.

వాలి—భాగ్యము [నిష్క్రమింతురు]

తార—వగలాడియయిన యీరుమనెట్లయిన పరాభవింపక తీరదు. ఇదేమో సుగుణసంపన్నురాలని నమ్మి నాధుడు దీనివలలో పడినాడు. అబ్బ! నేను దీనినిసహింపఁగలనా? ఇంత జేసినజగజంత నరకాలపాలయును. కాని ఇందుల కేమియుపాయము చేయవలయును. ఆఁ! తెలిసె-ఇది బహుచమత్కారమైనయుపాయము దీనివల. దీనిమనస్సునా నాధునకు దెలియుటయే కాక నాచమత్కారమును వెల్లడియగును.

(నిష్క్రమించును)

(వాలి, జాంబ, ప్ర)

జాంబ—మహారాజా! మీరూరకలేనిపోనిసంశయములు మన

స్సున నొంచుకొనవలెను. మీకేకోగోతము పైగొంచెమనుగ్రహముగలుగ వలయునని యిచ్ఛామూలముగాను నవంతిసంగుదొరికిన వారిపైవీరిపై నభూతకల్పనలను గావించి లేనిపోనియవాంతరకల్లోలములను గల్పించు వారిమాటలు మీరు సాటి గావించి రాజనీతికేలభంగమును దెచ్చుకొం దురు. తినిసినాలుగుమెతుకులను జీర్ణముగు దారిలేక పనిపాటలు లేక బలసి తిరుగుపాపాత్ముల కిదియేవృత్తి.

వాలి — అట్లయిన ఆంజనేయులు దప్ప మరెవ్వరును సుగ్రీవుని దగ్గఱకేగుట లేదుగద !

జాంబ — లేదని నేను చెప్పిన మీరు విశ్వసింపవలయును. అది గాక మహాప్రభూ!

గీ. ఎల్లపుడు నేమగడ పర | మేశ్వరుండు
గాని ప్రాణులచే నేది | గాదు సుమ్ము
ఇంతమాత్రమునకు భవ | త్స్వాంతమందు
కలత గనుట భావ్యము | గాదు రాజ

వాలి — అట్లయిన దైవముపై భారమువైచి రాజద్రోహులను శిక్షింపవలదందువా?

జాంబ — రాజా! నాయభిప్రాయమదికాదు. ద్రోహియగువాడు తప్పక శిక్షింపవలయును కాని యిట్టిసందిగ్ధవిషయములలో మనముతొం దరపడి ప్రతివానిమాటయు విశ్వసించినచో దొంగలు దొరలగుటయు దొరలు దొంగలగుటయు సంభవించును. పలువురు పలుకుమాటలను చెవిని వేసికొని దేనిని విశ్వసింపక రహస్యముగ రాజు ప్రయత్నించి నిజము తెలిసికొని నిదర్శనపూర్వకముగ ద్రోహులను భక్తులను తే ల్చుకొనవలయును. అంతేకాని, ముందుగాచేయు ఆర్భాటము వలన నిర్దో షు లగువారిమనస్సులు దెబ్బతినును. ఆనిందయుందరినెత్తిని రుద్దుట రాజనీతి కి లక్షణము కాదు. మంచివారు మనస్సులు చెడుటతో నరిపోక వారు ద్రోహులుగానయితము మారవచ్చును.

వాలి—అట్లయిన రహస్యముగా గుణవిమర్శన చేయుట యుక్తమనెదవా?

జాంబ—ఆహా! మహాత్మునికి—

వాలి—సుగ్రీవపత్నియగు రుమవిషయమేమని విూయభిప్రాయము.

జాంబ—అది నేను చెప్పలేను. నీవే రహస్యముగ దానిగుణ మెఱుంగుము.

వాలి—అట్లేచేయుదును. మనమింక నరుగుదము రండు.

[నిష్క్రమింతురు]

(రుమ ప్రవేశము)

రుమ—నాథునివిడచి యెన్నినాళ్ళయినది. ఆయనదర్శనము నాటికి నేటికిని గానేలేదుగదా! హా దైవమా-నిన్నేమందును. వగాక్రమమున ననమానుండై పౌరుషమున నద్వితీయుడైయుండదగిన పురుషోత్తముని కొండలబట్టించి యతని భార్యకరణ్యరోదనమును గల్పించిన విధి యెంత బలవంతమయినది యీవిరహము నెవ్వరితో చెప్పుకొందును. సురాపానమత్తుండై దినదినమును తన్ను వరింపుమని నన్ను బలవంతపెట్టుచున్నాడే యీవాలి. నేనేమి చేయుదును

గీ. రత్నపరిపూర్ణశోభాపి ♦ నూత్నమైన
కనకమందిరరాజంబు ♦ కమలముఖులు
వే వేలుగ దాసీలు ♦ ప్రియకరములె?
మగడు లేనట్టిమానినీ ♦ మణికి నెందు?

[తార సుగ్రీవవేషముతో ప్రవేశము]

తార—(తనలో) ప్రభూ! ఈసుగ్రీవవేషము నాకిపుడెంత చక్కగా నమరినది! ఇది రుమను మోసపుచ్చుట కెంతయు దగియున్నది. (దగ్గఱకువచ్చును)

రుమ—ఓహో! ఏమిది? ప్రాణేశ్వరుఁడు. ఎన్నినాళ్లకు దర్శనము! ఇదియేమి! ఇంతగా శుష్కించి పోయెను! అయ్యయ్యో ఇది యేమన నేల! వేళకట్టుగ నన్నము లేక నీరు లేక యిట్లయియుండును! అకటా! పరిచారికను నేను జీవించియుండఁగనే నానాథునికిట్టి దుర్గతి సంఘటిల్లెనుగా?

తార—ప్రాణనాయకీ! చిరకాలమునకు వచ్చితిననియైనా నాతో మాటలాడవు ?

కం. పొలతీ యమృతోత్పాదక
సలలిత వాక్యముల బలుకవె జాలవె దేవీ
కలికీ యలుకా చిలుకల
కొలికీ! మరుకేళి శిక్షకె కూర్పుము వేగన్.

రుమ—(తనలో) ఇన్నినాళ్ళు జ్ఞప్తికి రాని పత్ని నేఁడు జ్ఞప్తికి వచ్చెను గాబోలును. పాపము. నాథా! జీవితేశ్వరి జీవించి యున్నదో లేదో కనుఁగొనుటకు తీరిక లేకున్నను మీకవసరము వచ్చినప్పుడెంత తీయగామాటలాడుచున్నారు. పాపము! పొండు. మీకనుగ్రహము గలుగు కాంతలదగ్గఱకే పొండు. ఇన్నినాళ్ళుగడచిన నింకఁ గొన్ని నాళ్ళు గడువక పోవు?

తార—(తనలో) అబ్బ! మగఁడనియే భ్రమపడి ప్రణయకోపములు చూపింప సాగితివే వగలాడీ! నీమొగము జూచుట ముందున్నదిలే! ప్రాణేశ్వరీ! నాబంగారుబొమ్మా! నాకాంతామణీ! నాపై నీకలుకేటికి రమ్ము. నాకు నీ కౌఁగిలిమ్ము.

[వాలి ప్రవేశము]

వాలి—ఆఁ! ఎంతసాహసము? ఎంతమోసము? ఎందరెందరు కావలి గాచుచుండిన నీపాపాత్ముఁడంతఃపురమునకు వచ్చె నేమిచిత్రము! చాటుననుండియే యీచిత్రమును గాంచెదను.

రుమ—నాథా! గృహమును పతినివదలి గుట్టలు బట్టితిరిగెదా? కానిండు. ఇట్లెన్నినాళ్ళు తిరుగవలయునో అన్నినాళ్ళు తిరిగియే గృహమునకు రండు. అప్పుడే మీతో సుఖించెదను.

తార—కలికీ! నీకు నాపైనింతలో నలుక వొడమినదా? నన్నిట్లు నీవు చులకనగామాటలాడిన చురుకు చురుకని నామొద మరుఁడు కరుకుటమ్ముల బిరబిర జార విడచుచున్నాఁడు. మరునమ్మరమ్మునకు రమ్మనకుండుట భావ్యమా కొమ్మా!

వాలి—ఆఁ! ఆఁ! శృతిమించి రాగమునఁ బడుచున్నదే! ఇందులకు రుమ యేమనునో:

రుమ—నాథా! విరహబాధయిప్పుడు గదా నీకు దెలసెను! నేను సయితమిట్లు వ్యథనందినది సుంతైన గురుతింపవైతివిగదా?

తార—సతీ! నన్ను క్షమింపుము

[ఇద్దరు కలియబోవుదురు]

వాలి—ఛీ! దుష్టాత్మా! సుగ్రీవా! చోరునివలె నంతఃపురము చేరినదే చాలక ఆనాతిని ముట్టుచుంటివా? దూరముగా నుండుము.

రుమ—వానరరాజా! నీతమ్ముని క్షమింపుము.

వాలి—ఛీ! పాంసులా! నీకేమితక్కువ జేసితినని తిరిగి యాచండాలునిపై భ్రాంతి పడితివి! వీఁడు నీకేమి నెత్తిమీఁదివాఁడా?

రుమ—నెత్తిమీఁదివాడగునో కాదో! నానాథుఁడును, నేనును చిరకాలమునకు గలసికొంటిమి ఈనాడు నాకీతడవతారపురుషుడయ్యెను.

తార—(తనలో) ఆఁ! నిజము చెప్పితివి. ఈనాడు నీకీతఁడవతారపురుషుఁడే యయ్యెను.

వాలి—ఓరీ కపటశీలా! సుగ్రీవా! సంహరించుటకు నేనురాలేనని కుక్కవలె ఋష్యమూకమునం జేరి తలదాచుకొంటివే! ఇప్పుడు నీవే నాయింట వంటయింటికుందేటి చందమునఁ జిక్కితివేమిరా?

తార—ఛీ? పేలకుము. నామగతనము చూపఁదలఁచిన నీవాగ కలవా? నేనుభయపడి ఋష్యమూకమునకు జోయితినా?

వాలి—మగతనము రెట్టింపనేల? ఆడుదానవా యేమి?

తార—(తనలో) ఆఁ! గుర్తించెనా యేమి?

రుమ—రాజేంద్రా! ఆడుదియే యనుకొనియైన క్షమింపుము.

వాలి—ఛీ! ఛీ! మీయిద్దరి నింక క్షమింతునా?

(తారతో మల్లయుద్ధము చేయును)

[తారమీసము ఊడి పోవును]

తార—(మస్తులు తీసివేసి) ఆఁ! ఆఁ! నాథా! సుగ్రీవునిమీద కోపము సుదతిపై చూపకుము. రుమా! పతిబోంది మోహమున నవతిపై బడకుము?

వాలి—అన్నా! సుగ్రీవుఁడనియే భ్రమపడితిని గదా!

తార—ఒక్క-సుగ్రీవుఁడని మాత్రమే భ్రమపడితిరా? సుగ్రీవునిపై భ్రాంతిగలయీనాగలాడిపై నిరంతరము భ్రాంతి పడితిరా!

రుమ—ఇది నన్నెంతమోసము చేసినది!

తార—రుమా దేవిగారా? సుగ్రీవరాజేంద్రుల వెనుకటి భార్యగారా. వాలిరాజేంద్రుల యిప్పటి ముద్దుల—మురిపెముల భార్యగారా? ఏదీ. ఇందాకటి సరస మిప్పు డేదువండి! ఏదీ. "నాథా. విరహబాధ యిప్పుడు గదా తెలసెను." ఆఁ! ఏమి పోతరమే నీకు? తినునది మగనిసొమ్ము! పాడునది మిండలపాట! విరహముచేత చచ్చుచుంటివా? నాథా! యిప్పటికైన భ్రమ వదలినదా? ఇంకను గన్నులగట్టుచునే యున్నదా?

వాలి—తారా! వాస్తవము. ఇంతజేసినను, సుగ్రీవునిపైననే, మమతగలదీని సిగ దరుగవలయును.

(జాంబవంతుడు వచ్చి,)

జాంబ—ఆ! ఆ! రాజేంద్రా! ఏమిటని యిది ?

వాలి—తాతా! వచ్చితిరా ?

జాంబ—వెఱ్ఱివాఁడా! అరుమకు పతిభక్తియుండుట తప్పేమి? కులాచారమగు నేని, సుగ్రీవుఁడు మృతుఁడైన పిదప దీని నేలుకొనును. ఇప్పుడు తొందరపడకుము.

వాలి—ముద్దుగుమ్మలారా! ఇఁక లోనికరుగుఁడు.

తార—
రుమ— (మెటికలు విరుచుకొనుచు నిష్క్రమించును.)

జాంబ—రాజేంద్రా! ఈదినమున, ఋష్యమూకమున జరిగిన కొన్ని విశేషములు గలవు నీకెఱింగెదను రమ్ము.

వా—చిత్తము.

(నిష్క్రమింతురు)





శ్రీ

# సుగ్రీవపట్టాభిషేకము.

పంచమాంకము.

ప్రథమరంగము.

రాము—లక్ష్మ—సుగ్రీ—అంగ—ప్రి.

లక్ష్మ—సోదరా! సందేహము లేదు. ఈసుగ్రీవుఁడొసంగిన యాభరణములును, చేలాంచలమును, వధూటికవనుటకు సంశయము లేదు. కాని,

గీ. చూడఁజూడ నిష్ప్రభము సుగ్రీవు వదనంబు
సంశయమున దోఁగు సరణిఁదోఁచె
కానుపింపదయ్యె కారణమింతైన
నరసిచూడఁ డెంద మన్నవారు||

రాము—అట్టిసంశయమున కాస్పదమెక్కడ? అగ్నిసన్నిధానమున వాలిని సంహరించి, కిష్కింధరాజ్యము నిచ్చెదనని నేను సుగ్రీవునకును, వర్షాకాలము గడచినతోడనే మైథిలిని వెదకుదునని సుగ్రీవుఁడు నాకును, నొసంగి వాగ్దత్తమును మమ్ములను బంధువులకన్న నధికముగ బంధింపవే! సుగ్రీవా? నీమనస్సున నేదియో సందియము లేదా?

సుగ్రీ—మహాప్రభూ! క్షమింపవలయును.

రాము—ఏల, అట్టిసంశయము గలచోట తీర్చుకొనవలయును. వేలనన?

గీ. సంశయము లేక దినదినే చ్ఛాప్రవర్ధ
మాన మైత్రికి సాటి యీ మహిని లేదు
మఱిని సంశయ సహితమౌ మైత్రికన్న
తలపఁగాని విరోధ మీ ధరణి లేదు

సుగ్రీ—నాయనా, వాలిశౌర్యము లోకవిదితమైనది. నేనంతవఱకు వీక్షించినవీరులందు వాలినిమీరినవీరునిఁ గాంచినది లేదు. అతనిని_

రాము—సుగ్రీవా! చెప్పుము చెప్పుము సంశయింపనక్కఱలేదు.

సుగ్రీ—

గీ. అనఘ! దూరదేశాగతు లగుటచేత
నెఱుఁగకడిగెద నన్ను క్షమింపవలయు
నిట్టి వాలినిఁబోలు వధియింపఁగలుగిన
చేవగలవారలని పరీక్షింపఁదలఁతు॥

లక్ష్మ—సుగ్రీవా! ఆహాహా! ఎంతగొప్పసంశయముఁ బూనితివి! మర్కటజన్ముఁడవగు నీకంతకన్న దొడ్డబుద్ధి యీశ్వరుడు ప్రసాదింపఁజాలకపోయెను పాపము! కురులుముడికందని ప్రాయమున సుబాహునివధించి మారీచుని సాగరంబున బారద్రోలి తాటకిని ఖండించి యహల్యాశాపంబు బాపి, సకలరాజన్యసమూహంబునకు హరునివిల్లు విరచి, మిథిలింబరిణయమాడి పరశురాముని భంగపరచి, తండ్రిమాటనిలుప సత్యవాక్యపరిపాలనార్థ మరణ్యభూములకేతెంచి కబంధ విరాధ ఖరదూషణాది రాక్షసుల ననేకుల నామావశేషము చేసిన, సుప్రతాపవర్తిని, అశేషవిశ్రాంత ధవళకీర్తిని, శ్రీరామమూర్తిని శౌర్యహీనుఁడని సంశయించుచుంటివా? ఆహాహా! మర్కటచాపల్యము పోనిచ్చుకొనవైతివిగదా సుగ్రీవా?

రాము—తమ్ముఁడా ! పూజ్యుఁడగు సుగ్రీవు నట్లు దూషింపఁ దగువా ! ఎంతమాటాడితివి ! ప్రాణభీతిగలవాని కట్టిసంశయముండుట తప్పందువా ? తప్పక పరీక్షించుకొననిమ్ము. అతని మనస్సునకు తోఁచిన పరీక్షను చేసికొననిమ్ము ! సుగ్రీవా!!

రాము—

గీ. సంశయమునొంద బనిలేదు ! జలధియెల్ల
బీల్చి యాపోశనంబు గా ! వింపవలెను ?
యిప్పుడమి, నెల్ల గిరగిర ! ద్రిప్పవలెను?
దెలుపు గావింతు మీక నాత్మ ! గలఁతదొలఁగ.

సుగ్రీ—మహాప్రభూ ! చిరకాలమునుండియు నిచ్చట నేడు మద్దిచెట్లొకదాని కొకటి సూటిగాలేక వంకరటింకరగా నున్నవి! వానినేడింటి నొక్క బాణంబున గూల్చినను, సరియే ఏదానవు! నిక తంబున మాయన్నకును నాకును విరోధముగలిగెనో, యాదుందుభి కళేబరమిందే కలదు. దానిని మింటికెగమీటినను సరియే. తమరు నాయన్నను చంపగలవారని నమ్మెదను.

రాము—ఒక్కటేల ? రెండుపనులును గావింతును !

(సప్తసాలములం గూల్చి దుందుభికళేబర మెగమీటును)

సుగ్రీ—ఆహా ! రామచంద్రుని శౌర్యము ! మహాత్మా ! ఎఱుగక నిన్ను బరీక్షించితి.

లక్ష్మ—సుగ్రీవా ! స్తుతింపులకేమి ! మీరు మాపై నిట్టి సంశయముగలిగిన మారు మాపైనట్టి సంశయమే యేల కలుగఁగూడదు ! సీతాన్వేషణ మొనరింపఁదగిన శౌర్యము మీకడగలదని నిదర్శనము చూపఁగలవా ?

రాము—తమ్ముఁడా ! యిప్పుడేల ?

సుగ్రీ—రామసౌమిత్రులారా ! ఎంతటికార్యమునైన మా ఆంజనేయుఁడే కావింపఁగలఁడు. ఆంజనేయా! నివిశ్వరూపప్రదర్శనముచే నిశక్తి రామచంద్రమూర్తికి గనఁబరపుము.

హను—భాగ్యము—(విశ్వరూపము చూపును.

## ద్వితీయరంగము.

వాలి—తార—అంగ—ప్ర॥

వాలి—ప్రాణేశ్వరీ ! తారా! నీభీతి కేవలభ్రాంతిమూలకమైనది ! ఎదుట నిలువఁబడి ముఖాముఖి నెదుర్కొని నన్ను నిర్జింపఁగల శూరుఁడీపదునాలుగులోకంబుల నెందును లేఁడు.

తారా—నాథా! క్రిందటిరేయి నాకు గల్గిన దుస్స్వప్నమును, నేఁడు తటస్థించిన చర్యలును జూడ, నాహృదయము విషాదభారముచే తల్లడిల్లుచున్నది

వాలి—ఆహా ! వనితలెంత ప్రకృతిభీరువులు ! కలలకు కల్లలకు నులికిపడుచు మగవారికిఁగూడ భ్రాంతిఁ గొలుపుచుందురుగదా! అంగదా! నీవు నిజము మీయమ్మవలె భయపడుటలేదు గదా ?

అంగ—జనకా ! భయము శత్రువునకుఁ గాదుగాని, చక్రికి నేనే కాదు మీరును భయపడక తప్పదు.

వాలి—నాయనా ! అంగదా ! చక్రియెవ్వఁడు ?

అంగ—జనకా! నామనవిని వినుఁడు: చక్రి యీరాముఁడని వింటిని.

వాలి—[ముద్దిసుకొని] నాయనా ! నీకిప్పుడే చక్రియందలి పరిజ్ఞానమును వైష్ణవభక్తియుఁ గలిగినవా ?

[జాంబవంతుఁడు ప్ర॥]

జాంబ—మహాప్రభూ ! మీసోదరుఁడగు సుగ్రీవుఁడు రణమునకుఁ బిలుచుచున్నాఁడు.

వాలి—ఆ—ఆ—ఏమి ? మఱల నిప్పుడే రణమునకు పిలుచుచున్నాఁడా? నాచేత నిప్పుడే కాదా, ప్రహారణము లంది పోయినాఁడు కానిమ్ము. తారాంగదులారా ! మీరంతఃపురమున కరుగుడు! నేను సుగ్రీవుని మదమడంచి వచ్చెదను.

తార—
అంగ— } నిష్క్రమించును]

వాలి—జాంబవంతా! ఏడియాపాపి సుగ్రీవుఁడేడి?

సుగ్రీ—(ప్రవే) సోదరుని నిర్భాగ్యునిఁ జేసిన నీవా పాపివి, నేనా?—ఓసోదరా! రాజ్యాపహరణమహానీతిశాలీ! వాలీ!—

సీ. నీతియించుక లేని । నీ చేతుల మూఁక పైఁ
బరిపాలన ప్రజ్ఞఁ । బరపినట్లు
దుర్బలుం డైనయా । దుందుభిశోఁ బోరి
పౌలియించి ఘనుఁడ నం । చలరినట్లు
పాపంబులం గ్రుంగి, । యోషఁ జాలని దశ
గ్రీవుని ద్వేషింపోన । గెలిచినట్లు
తపమునందున్న మ । తంగు బాధించి, యం
చితతపోభంగంబుఁ । జేసినట్లు
సూర్యనందనుఁడను మహా । శూరవరుఁడ
రామచంద్రకరస్థ వీ । రాధవీర
శాతబాణసంరక్షణా । సమవిభాసు
నన్ను సుగ్రీవుగెలువ, పై । నున్న పనియె?

వాలి—ఆలిపోయి యిల్లుపోయి వైభవముపోయి రాజ్యము పోయి ఆకులుదినుచు, నడవులఁబట్టి నిలువనిడ లేక ఋష్యమూకంబుఁ జేరినను, నీకు తెగనీల్గువదలనందుల కాశ్చర్యముగ నున్నది. చింతచచ్చినను, పులుసుచావలేదుగా! ఐనను దానికేమి లే! దానిని సయితము శీఘ్రముగ నణగించెద.

ఉ. రాముఁడు గీముఁడున్ రిపు వి । రాముఁడు, భీముఁడు వచ్చెఁగాక, సా
రాములబాణకోటుల వి । రామవిహీనత నేయుఁగాక ఘో
రామర వైరి లోకముల । రాచితి, నేచితి, కాచితేలపో
రా, మతిహీన! వాలియొక । రాజున కోడునె? కోడిగంబుగన్।

సుగ్రీ—కోఁతివానికి కోడిగ మేమికొత్త?—అన్నా! అధర్మము చేసిన నిన్ను పరాత్పరుఁడు క్షమింపఁడు. భగవంతుఁడని మునిగ

ణంబెల్ల వేనోళ్ల వినుతించు శ్రీరామచంద్రపరబ్రహ్మమును రాముఁ
డు, గీముఁడని, నిందాగర్భముగ మాటలాడితివి. నాయాలిని తస్క
రించి, న్యాయముగా నాకు రాఁదగిన అర్థరాజ్యమును సున్నఁజుట్టి
అడవులఁ బట్టించితివి. దారాసుతు లిరువంకఁ జేరి రామునితో వైర
మువలదని మొరపెట్టుకొనిన వినక వారి హితోపదేశములను పెడ
చెవినిం బెట్టితివి ! —ప్రపంచమున, నాకంటె మహావీరుఁడు లేఁడని
నాయెదుట నిలచి పోరఁగలధైర్యశాలి లేడని లోకధిక్కార మొనరించి,
మహాఖర్వగర్వభూయిష్ఠుఁడవైతివి. పాపములచే. గ్రుంగిపోయి, దుర్బ
లుఁడైన రావణునిఁ బట్టి సముద్రమునఁ ముంచితినని మాటిమాటికిని
బ్రలాపము లాడుచుంటివి ! అన్నా ! ఇంతేనా నీప్రతాపము ? —ఎంత
కాలమిట్లు బంధువిరోధాగ్నిని నట్టింట రవుల్కొలుపుకొందువు ? ఎంత
కాలమిట్లు సోదర శాపాగ్ని కీలామాలికల కాకలధాకల కోర్వఁ
గలవు ? —పోనిమ్ము. ఇఁక నెంతకాలము శ్రీరామతీవ్రశర కాండ
ప్రచండతను దప్పించుకొని నీజానిసలలో మెప్పొందఁగలవు ? —
మహావైభవమునకును, సత్కీర్తికిని నాలవాల మగుకిష్కింధాపురము
నీవలనఁగదా దుర్యశమునకు నెలవైనది !

వాలి—ఛీ ! దుర్మతీ ! నావలన కిష్కింధకు దుర్యశ మేమిరా?

సుగ్రీ—అన్నా ! ఆగ్రహింపకుము. నీవలన దుర్యశ మే లేదా!
రాజనీతిపారంగతుఁడవే ! —కోతివైనను, దేవేంద్రనందనుఁడవుగాని,
సామాన్యుఁడవుగావే ! సమస్తశాస్త్రముల నభ్యస్తముఁ జేసితివి !
ఎందైన, ఏశాస్త్రములందైన, ఏచరిత్రలందైన, నన్నదమ్ములు రాజ్య
ముకొఱకు తగవులాడి బాగుపడినట్లు చదివితివే ? —కాక, వింటివే?—
అయ్యయ్యో ! అంతఃకలహములవలన నేకదా ? రాజ్యములకు నాశ
నము ! —అంతఃకలహముల కారణమున నెన్నిరాజ్యములు నాశనము
లైనవి ! ఎందఱు రాజ్యాధిపతులు గతించిరి ! ఎన్నిపురములు వల్లకాళ్ల
యినవి ! అన్నా ! ఇంద్రనందనా ! వాలీ !

సీ. తలకొకవంక దా । రులు దీసినదమునే
కృద్ధ్వోశనాశన । హేతువయ్యె!
చెలికాండ్రతో లెక్కేతులు దీయుకుటేలు జే
భూపాలురకు వేరు । పురుగులయ్యె
మనలోన మనకు రా । రణకలహంబులే,
నశియించుటకు కార । ణంబులయ్యె
పైనుండి పడిరాళ్లు । వైచి నవ్వెడువార
లనువుగా భూపాలు । రగుచుండరయ్యె!
దారుణకుటుంబకలహము । లెట్టి విలయమును,
సంఘటిల జేయునో చింత । సలుపుమయ్యె
ఖలులమాటలు విని సుగ్రీ । వ నిరయక
కులమునకు నపకారంబు । సలుపకయ్యె!

వాలి—ఓహో! సుగ్రీవా! ఏమిధర్మోపదేశము చేసితివి! ఎంతటి న్యాయమార్గము నుపదేశించితివి? నాడు దుందుభితో నేను రణమాచరించుచుండగా, పర్వతబిలంబునకు పాషాణశిల నవరోధముగా నుంచి, నేను చచ్చితి ననియే తలంచి, నారాజ్యముతో పాటు వదిన యని జంకక, నాభార్య నేలుకొన్నపుడీధర్మశాస్త్రము లేమయ్యెనురా గుర్మతీ!—

సుగ్రీ—అన్నా! నిన్ను మోసగించి నేను గృహమునకు రాలేదే! నీవు మృతినందితివని తలంచి, మన కులాచారక్రమముగ తారను వివాహమాడితిని.

వాలి—మంచిది; సుగ్రీవ! నీవు నన్నును మోసగింపదలంపలేదు. నేను నిన్నును మోసగింపదలంపలేదు. నేను జీవించియుండగా నీవెట్లు నేను చచ్చితినని తలంచితివో, అట్లే నీవు జీవించియుం

డగా నీవు వచ్చితివని తలంచి నేను నీసతిఁ గట్టుకొంటిని ; ఇందు దోషమేమి ?—

సుగ్రీ—ఆహాహా ! మంచినీతిఁ జెప్పితివి ! ఇట్టిదుర్బుద్ధి గలిగిన నిన్నిఁక భగవంతుఁడు క్షమియింపఁడు. నాచేతిముష్టిప్రహారములనంది గెలువుము. నావలనఁ గానిచో రామమూర్తి రాఁగలఁడు.

వాలి—శ్రీరామమూర్తియు, నీవును, నాశౌర్యాగ్ని కింధనమాత్రులగా తులువా !

సుగ్రీ—

—♦ పంచచామరము. ♦—

కలుషములాడకు కారులు ప్రేలకు గడగడలాడఁగ నిన్నిపుడే
పలుమఱు జీరెద; నిసుమాత్రమార్చెద, నిశ్చలవీరబలోద్ధతిచే
పలుమఱు బింకపు లాడెద వేటికి భండనమందున శూరుడవో
నిలచెదొ కాంచెద; నీదుబలంబు, నఖండితవీరవిహారములన్

వాలి—

—♦ పంచచామరము. ♦—

సురగరుడోరగ శూరులగుండెలుచూర్ణము జేసిన వాలినిరా
కరము, నరాంతక కాండము నెల్ల వికంపిత దేహులఁ జేసితిరా
బిరబిర సంగరమంచును నీవిటుబీరములాడఁగ గాదు సుమా
గిరగిరదిరిగి ధరాతలమందున కేరడమేటికి ? గూలెదురా.

(ఇద్దఱు యుద్ధముచేయ సుగ్రీవుఁడు పడిపోవును )

వాలి—ఛీ! దుర్బలుఁడా ! ఇట్లే ధూళిలోఁ బొరలాడుము. నీకు పాదతాడనమే గతి! (కాలితోఁదన్ని ప్రస్థా)

(రామ, లక్ష్మ, హను—ప్రవే॥)

రామ—తమ్ముఁడా ! వాలి సుగ్రీవులలో నాకించుకయు భేదము తెలియక నేను వాలిని వధింపలేకపోయితిని. అతఁ డిచ్చట మూర్ఛిల్లినాఁడు ! పాపము !

లక్ష్మ—ఈసారి సుగ్రీవుని కంఠమునం దీపుష్పమాలిక వాన వాలుగ నుంతిము.

హను—సుగ్రీవరాజేంద్రా ! సుగ్రీవరాజేంద్రా ! శ్రీరామ సౌమిత్రులు వచ్చినారు. లెమ్ము; లెమ్ము.

సుగ్రీ—హా ! రామచంద్రప్రభూ ! శరీరము వాలిదెబ్బలచే చూర్ణమైనది; వాలితో పోరాడునప్పు డాపాపిని మీరు హతమార్తు రనుకొంటిని; మోసపోయితిని. ప్రహారములు దుర్భరములుగ నున్నవి. రాఘవా ! శరణాగతుండను.

రామ—సుగ్రీవరాజా ! వగవకుము

గీ. ఏకరూపులరైన మీ యిరువురందు,
భేదమేర్పరుపంగ లేక వెకలినైతి
కలితపుష్పమాలికను నీ కంఠసీమ
నుంచెదను; పిల్వు మతని మ రొక్కమారు.

సుగ్రీ—భాగ్యము ; తమ రాచెట్టుచాటుననే యుండవలయును.

రాము, లక్ష్మ, హను } (ప్రస్థా)

సుగ్రీ—ఓహో ! ప్లవంగసేనానాయకులారా ! వీరులారా! నేను శ్రీరామ భక్తుండను. మీ రాజగువాలితమ్ముండను. సుగ్రీవుండను పేరుగలవాండను ; బిగ్గఱగం జెప్పుచున్నాను. వినుండు

సీ. బహుళవైభవమున వానరసేనతో
కిష్కింధ నేలెడు కీర్తిశాలి
తమ్ము వాలిని, సార ధరణీతలంబును,
సమముగా నేలెడు సాహసుండు

స్వభుజప్రతాప సం ॥ స్తవ మొనరించుచు
డటి పడద్రొట్టి మ ॥ హాభిమాని
అనుజాతరాజ్యాప ॥ హారణసత్కార్యమే
తారకంబనుకొన్న ॥ ధన్యగాత్రు
డగు మహాబుద్ధిమంతుఁ డ ॥ త్యంతబలుఁడు
సోదరుఁడు నాకు; మీకు శా ॥ మీధవుండు
వాలియను పేరుగల్గు పా ॥ భాగ్యమూర్తి
యెచటనున్నవాఁడెచట! వా ॥ డెచట చెప్పుఁడి!

వాలి—ఓరి మొండిబండా! నాదర్శనమున కెంత యార్భాటము కావలెనా? యుద్ధమునకే గనా? తిరిగి కట్టిగ తన్నులు తిందువుగాని—ఓహో! ఏమిది? ఈసారి పెండ్లికొడుకువలె సుమమాల ధరించి వచ్చితివి! అట్లయిన ముక్తికాంతను పెండ్లాడుదువుగాని రమ్ము

సుగ్రీ—ముక్తికాంత నేల?—విజయలక్ష్మినే పెండ్లాడెదనురా.

(ఇద్దఱు యుద్ధము చేయుచుండగా రాముఁడు వాలిని గొట్టును. వాలి పడిపోవును)

సుగ్రీ
హను } జయ్! శ్రీరామచంద్రమూర్తికి జయ్!
లక్ష్మ
(కోలాహలము చేయుదురు.)

సుగ్రీ—రామచంద్రప్రభూ! నమస్కారము.

గీ. అఖిలజగముల గెల్చె నా ॥ యన్న వాలి
యతని నొక బాణమున గెల్చి ॥ నట్టి శౌర్య
ధనుఁడగు మహాత్ముఁడవు నీవు ॥ ధారుణీశ!
లోకనాథుఁడవయ్య సు ॥ శ్లోకమూర్తి!

రాము—తాళుము తాళుము. వాలి యేమో పలుకుచున్నవాఁడు-వినరమ్ము

వాలి___హా! హా! రామా_రామా_ఇంతకపటమా?_ఇంత మోసమా?_లజ్జ_లజ్జ_సిగ్గు సిగ్గు_చెట్టుచాటుననుండియా? నాయెదుటకు రాలేక_మారాడలేక_లోకాతీతపరాక్రమవంతుఁడనగు నన్ను గెలువలేక చెట్టుచాటుననుండి కొట్టితివా! ఛీ_సిగ్గు సిగ్గు (కన్నులుమూయును)

లక్ష్మ__సోదరా! వాలి యిట్లు పలుకుచున్నాఁడేమి?

రామ___(స్వగ) ఆహా! ఎంతపరిహాసమైనది?

గీ. శౌర్యమున నొక్క కోఁతినిఁ జంపలేక
దొంగతనమున వధియించు దోషమునకుఁ
బాలుపడె రాముఁడని యింక భావిజనులు
పలుకఁజూతురుగాఁ బోలు కలుషమంచు.

(తార, అంగదుఁడు శోకించుచు ప్ర॥)

తార___హా! రామా! ఇదియేమి? నీవుధర్మమూర్తి వని చెప్పుదురే! ఈ హేయకార్య మాచరించితి వేమి? కోఁతిని చంపి భక్షింపమనసయ్యెనా? రాజులకు వేట సహజగుణ మైన నీకు కోఁతి మాంస ముపయుక్తము గాదే! ఆహా! భార్యను బాసి భ్రాంతుఁడవైతివా! రాజా! ఎక్కడనో మహారణ్యముల నున్న మా రాజ్యమున దగవులు దీర్ప నయోధ్యనుండి నీవు వచ్చితివి కాఁబోలును! న్యాయాన్యాయవిచారణము సలుప నీకు రాజ్యాధికారమైన లేదే! నీకీ స్వాతంత్ర్య మెట్లబ్బెను? పోనిమ్ము. శరణాగతుఁడైన సుగ్రీవుని బరిరక్షింప శూరకర్మం బాచరించితి వనుకొందమన్నను వీలు లేనిభంగి నీచతరంబుగ నెదుటకు రాలేక చెట్టుచాటునుండి చంపితివే ఈ యన్యాయం బూరకే పోవునా? ఏజన్మంబునఁ గాని నాపతియే నిన్నేకిరాతరూపంబుననో చంపకుండునా? హా! ప్రాణేశ్వరా! నన్ను విడిచిపోవుచుంటివా! వలదు వలదని చెవినిల్లు గట్టుకొని బోధించినను వినకపోయితివి. ఇఁక నీదుఃఖము నా కెన్ని నాళ్లకు వాయును? (దుఃఖించుచున్నది)

వాలి—(తెలివిగల్గి) రామా! ఇఁక నాప్రాణములు పోవుచున్నవి! నాకడుపులోనున్న నాలుగుమాటలును నీచెవిని వేసి చచ్చెదను. రావణునివధియించి సీతను చేకొనుటకై - సైన్యసహాయము చేయుదునని వాగ్దానము చేయుటచేతగదా, యీసుగ్రీవునిపక్షమునఁ జేరి నన్ను వధించితివి! ఈవెఱ్ఱినివదలి, నాపక్షమునఁ జేరియుండు వేని-రావణుని నాతోకతోఁ గట్టి తెచ్చి నీపాదములదరిఁ జేర్పకుందునే? వానిభార్యను నాభుజముపై నెక్కించుకొని రాకుందునే? ఎంత వెఱ్ఱిపని చేసితివి! ఈయసమర్థుఁడు సుగ్రీవుఁడా నీసతిని వెదకియిచ్చుట!-కానిమ్ము నీవు భగవంతుఁడవని గ్రహింతిగలను. నీతోడ మనసారయుద్ధము చేయక దొంగచాటు చచ్చితిననుచారముదక్క నీవలనఁ గూలుట నాకానందకరముగనే యున్నది. ఐనను నా కష్టముస్వర్గలోకావాప్తిగలుగ వరమిమ్ము. నాప్రాణములు పోవుచున్నవి.

రాము—బాహుబలశాలీ! వాలీ! పుణ్యాత్ముఁడవగునీకు స్వర్గసుఖము గలుగును.

వాలి—ధన్యాత్ముఁడ. ధన్యాత్ముఁడ. సుగ్రీవా! కిష్కింధ నేలుకొనుము. నాకంఠమున దేవేంద్రదత్తమగువైజయంతిమాల గలదు నాప్రాణములు పోయినపిదప నిది శక్తిహీనమగును. దీనినిప్పుడే గైకొనుము. ఇది రిపుజనదుస్సాధ్యమైనశౌర్యము నొసంగఁగలదు. తారాంగదులారా! మీమాటలువినక చెడితిని. మీకింకఁజెప్పవలసినదేమియునులేదు శ్రీరామమూర్తియాజ్ఞప్రకారముగ మెలంగుడు. రామచంద్రప్రభూ! మఱియొకమాట. నీకు వనవాసదీక్షగావున పురప్రవేశము చేయఁజాలవు. నాకన్నులయెదుటనే నీవు సుగ్రీవునకు రాజ్యప్రదానము చేయుము; తరువాత సౌమిత్రియథావిధిగ కిష్కింధలో పట్టాభిషేకోత్సవము జరుపును.

రాము—అట్లే చేయుదును.

లక్ష్మ—(స్వగ) అబ్బా! ఏమి వాలిగడుసుఁదనము? రామమూ తన్నుఁజంపినట్లే సుగ్రీవునిఁ జంపి రాజ్యము నపహరించునని తన న్నులయెదుటనే పట్టాభిషేకము చేయుమనుచున్నాఁడు.

రాము—(వైజయంతీకిరీటములచే సుగ్రీవు నలంకరించి స్వస్తివాచనములు చదువును)

(తెర వ్రాలును)

చతుర్థ దృశ్యము—కిష్కింధ.

(పట్టాభిషేకమందిరము)

(సుగ్రీవుఁడు పట్టాభిషిక్తుఁడై సపరివారముతో)

లక్ష్మ—సుగ్రీవరాజా! శుభముహూర్తమునఁ బట్టాభిషిక్తుఁడవైతివి; నీకింకేమి కావలయును.

సుగ్రీ—మహాప్రభూ! తమదయచేత నష్టరాజ్యప్రాప్తి గనెను. ఇకను నిట్లగుఁగాక!

ఆ. అన్నదమ్ములకును నన్యోన్య వైరంబు
గలుగకుండుఁ గాత! కపట వృత్తి
పరుల భార్యఁ గొన్న పాపాత్ముఁ డైశ్వర్య
హీనుఁడై మృతిని వహించుఁ గాక!

లక్ష్మ—తథాస్తు

(అందఱు మంగళము పాడుదురు)

సంపూర్ణము

## — వైద్యగ్రంథములు —

| | |
|---|---|
| డీనతుత్రమాల | 0- 4 |
| డీపరిజ్ఞానము | 0-6 |
| వ్యాధిచికిత్సాచంద్రిక | 0-12 |

## — హరికథలు —

| | |
|---|---|
| నా॥ మార్కండేయచరిత్ర | 0-12 |
| శ్చాంద్రోపాఖ్యానం | 0-12 |
| ణీకల్యాణము | 0-12 |
| కీచకవధము | 1- 0 |
| బరీషోపాఖ్యానం | 0- 8 |
| చరిత్ర | 0- 8 |
| ంద్రమోక్షం | 0- 8 |
| ర్యనారాయణశతకం | 0- 4 |
| రంగధరనాటకం | 1- 0 |
| యంవదాచరిత్ర బి॥ బా॥ | 0- 6 |
| రిశ్చంద్రోపాఖ్యానం , | 0- 6 |
| కల్యాణము | 0- 8 |
| కృష్ణరాయబారం | 0 10 |
| రుదాసుచరిత్ర బా నా | 1- 0 |
| రామజననం తో వెం | 0-8 |
| కీపరిణయం డిటో | 0- 8 |
| ల్యాశాపవిమోచనం | 0- 8 |
| శిమాల ఉ॥ అ॥ | 0-12 |
| రాచంద్రియం శా॥ వీ॥ | 0-12 |
| పుత్రవిజయం ఇ॥ య॥ | 1- 0 |
| ణాప్రతాపసింగ్ డిటో | 0 12 |

## — ఆంధ్రనాటకములు —

| | |
|---|---|
| శారదావిజయం కొ॥ ॥న | 0-12 |
| సామ్రాజ్యోదయం దో॥ సీ॥ | 0-10 |
| ముక్తావళి శ్రీం॥ భ॥ | 0-12 |
| మాళవిక ము॥ చం॥ | 0-12 |
| సత్యాబాయి జ॥ ల॥ | 0-12 |
| భీమప్రతిజ్ఞ క॥ కో॥ | 0-12 |
| కబీర్ దాసీయము శ॥ రా॥ | 0-12 |
| సారంగధర వి॥ సు॥ | 0-12 |
| కుశలవ డిటో | 0-12 |
| శ్రీనివాసకళ్యాణము దో॥ సీ | 0-2 |
| ప్రతిజ్ఞాయాదవము అ॥ సు॥ | 0-18 |
| విచిత్రచిత్రమాల అ॥ సో॥ | 0-12 |
| నవరత్న చింతామణి డిటో | 1-0 |
| సంపూర్ణోత్తరరామాయణం | 1-4 |
| చతురచంద్రహాస దో॥ సీ॥ | 0-8 |
| తులసీదాస్ కొ॥ స॥ | 1-0 |
| భక్తకబీర్ డిటో | 1-0 |
| లంకాదహనము వ॥ య॥ | 1-0 |
| రామరావణసంగ్రామం | 1-0 |
| సురాజుద్దౌలా జ॥ ల॥ | 0-8 |
| ప్రభాకర డిటో | 0-8 |
| సారంగధర ఆ॥ నా॥ | 1-0 |
| జయంతజయపాలం ॥దో॥ సీ॥ | 0-8 |
| మైరావణవధ కొ॥ హ॥ | 0-12 |
| తారాబాయి | 0-12 |

వలయువారు :— జనరల్ బుక్కుడిపో,

బెజవాడ, కృష్ణజిల్లా

# సంగీత కృష్ణలీల

వెల 1—0—0 మాత్రమే.

[గ్రంథకర్త: వడన్మకుంబ శింగరాచార్యులుగారు]

ఇందు శ్రీకృష్ణుని లీలలు పరమాద్భుతములు. ఇందు కంసుని యొక్క దుండగములు, గోపకులయొక్క భక్తియు, పూతనాసంహారము, గోవర్ధనోద్ధరణము, కాళీయమర్దనము, గొల్లవాండ్రయొక్క హాస్యరస సంభాషణము, రాధాకృష్ణులశృంగారరససంభాషణము రసాస్పదముగా వ్రాయబడియున్నది. ఇందు చక్కని సాంగ్సు కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారిచే రచియింపబడి యున్నవి. కొలదిప్రతులు మాత్రమే ముద్రించినారము. త్వరపడనిచో ప్రతులు దొరకవు.

# సంగీత గులోబకావళి.

నవరసములొల్కు ముద్దులమూటగట్టు నాటకరాజము. చక్కని పార్సి కర్ణాటక మట్లుతో రచియింపబడినది ఈనాటక మంతయు శృంగారరసమే. ఎచ్చటచదివిచూచిన ఆనందమే! వెల 1 0-0

# సంగీత లంకాదహనము

రామలక్ష్మణులు సీతను వెదకుట, హనుమత్సుగ్రీవులు చెలిమి చేయుట, వాలిసంహారము, హనుమంతుడు సముద్రము దాటి లంక కేతెంచుట, లంకిణిని చంపుట, సీతనుగాంచుట, హనుమద్రావణులసంభాషణ, లంకాదహనము, చక్కనికీర్తనలతో విరాజిల్లుచున్నది. వెల0-10-0

కంచుల గోవిందం—బుక్కుసెల్లర్ బెజవాడ కృష్ణాజిల్లా.